ఈపంచమభూమికయం దుండుయోగి బ్రహ్మవిద్వరుఁడని చెప్పఁబడును. ఆఱవభూమికలోనికి పోయినయోగి నిర్వికల్పసమాధిని చేయుచుండి పరప్రయత్నముచేత వ్యుత్థానమును బొందుచుండునుగాని స్వయముగా నెంతకాలమునకైనా వ్యుత్థానమును బొందనేరఁడు. ఈరెంటిలో అయిదవభూమిక సుషుప్తియని, ఆరవభూమిక గాఢసుషుప్తి యని చెప్పఁబడును.

ఈయర్థమును వసిష్ఠమహర్షిచే చెప్పఁబడినది.

శ్లో. పంచమీం భూమికామేత్య సుషుప్తిపదనామికాం,
శాంతాశేషవిశేషాంశ స్తిష్ఠత్యద్వైతమాత్రకే.

తా. సుషుప్తి యని చెప్పఁదగిన అయిదవభూమికను పొంది శమించిన సకలవిశేషములు గలవాఁడై అద్వితీయపరమాత్మస్వరూపమునందే నిలిచియుండును.

శ్లో. అంతర్ముఖతయా నిత్యం బహిర్వృత్తిపరోఽపి సన్,
పరిశ్రాంతతయా నిత్యం నిద్రాళురివ లక్ష్యతే.

తా. అయిదవభూమియందు చేరిన పురుషుఁడు సర్వకాలములయందు నంతర్ముఖుఁడై యున్నందున చక్షురాదీంద్రియములు బాహ్యమునందుఁ బ్రవర్తించుచున్నట్లు కనుపడుచున్నప్పటికి చిత్తవిశ్రాంతి కలవాఁ డగుటచేత సత్యము నిద్రించువానివలె చూడఁబడుచుండును.

శ్లో. కుర్వన్నభ్యాస మేతస్యాం భూమికాయాం వివాసనః,
షష్ఠీం గాఢసుషుప్త్యాఖ్యాం క్రమాత్పతతి భూమికాం.

తా. ఈసుషుప్తిభూమికయందు చిరకాల మభ్యాసము చేయుచుండి వాసనల నన్నిటిని విడిచినవాఁడై గాఢసుషు

ప్తి యని చెప్పఁదగిన ఆఱవభూమికను క్రమముగా పొందును.

శ్లో. యత్ర నాసన్నసద్రూపో నాహం నాప్యనహంకృతిః,
కేవలం క్షీణమనన ఆస్తే ద్వైతైక్యవర్జితః.

తా. ఆఱవభూమికయందు ప్రవేశించినపురుషుఁడు సద్రూపుఁడని కాని అహంకారవిశిష్టుఁడని కాని అహంకారశూన్యుఁడని కాని చెప్పఁబడఁడు. క్షీణించిన మనస్సుకలవాఁడై ద్వైతాద్వైతములు లేక కేవలముగా నుండును.

శ్లో. అద్వైతం కేచిదిచ్ఛంతి ద్వైత మిచ్ఛంతి కేచన,
సమం బ్రహ్మ న జానంతి ద్వైతాద్వైతవివర్జితం.

ఈలోకములోని జనులు కొందఱు ఈషష్ఠభూమికలోఁ జేరినవాని అద్వితీయుఁడని తలఁచెదరు. మరికొందఱు సద్వితీయుండని తలఁచెదరు. అద్వితీయత్వసద్వితీయత్వములు రెండును లేనివాఁడై సమముగా నుండు బ్రహ్మయే యని యెఱుఁగరు.

శ్లో. అంతశ్శూన్యో బహిశ్శూన్యః శూన్యకుంభ ఇవాంబరే,
అంతఃపూర్ణో బహిఃపూర్ణః పూర్ణకుంభ ఇవార్ణవే.

తా. ఈయాఱవభూమికయం దున్నపురుషుఁడు అంతరమందుఁగాని బాహ్యమందుఁగాని అన్య మేమియు లేనివాఁడై యాకాశమునం దుండు రిక్తకఁశమువలె నుండును. ఇదిగాక యాంతరమందును, బాహ్యమందును పూర్ణుఁడై సముద్రములో మునిఁగియున్న పూర్ణకుంభమువలె నుండును.

గాఢముగా నిర్వికల్పసమాధిని చెందిన పురుషుఁడు చిత్తము సంస్కారమాత్రముగా నున్నందున సాంకల్పికపదార్థ

ములను భాషించుటకుఁగాని బాహ్యపదార్థములను గ్రహించుటకుఁగాని సామర్థ్యము లేనందున నాకాశమునం దున్నకుంభమువలె వెలుపల లోపల శూన్యుఁడై యుండును. స్వయంప్రకాశసచ్చిదానందైకరసమగు పరబ్రహ్మయందు మగ్నుఁడై యున్నందున బాహ్యాభ్యంతరములయం దంతటను పరబ్రహ్మస్వరూపమునే చూచుచుండును గనుక సముద్రమున మునిఁగియున్న పూర్ణకుంభమువలె లోపల వెలుపల పూర్ణుఁడై యుండును. తురీయమనెడి యేడవభూమికను పొందినయోగికి స్వతంత్రముగాఁగాని పరతంత్రముగాఁగాని వ్యుత్థానమే కలుగనేరదు. ఇట్టి యోగిశిరోమణి నుద్దేశించి 'దేహం వినశ్వర' మను భాగవతశ్లోకము ప్రవర్తించినది. అసంప్రజ్ఞాతసమాధిని బోధించు యోగశాస్త్రము లన్నియు నీభూమికయందే పర్యవసానము నొందుచున్నవి. ఈయేడవభూమికయందుఁ జేరినయోగియే పూర్వోదాహృతశ్రుతియందు బ్రహ్మవిద్వరిష్ఠుఁ డని చెప్పఁబడెను. ఆఱవభూమికయందు చేరిన యోగి 'పార్శ్వస్థబోధితః' అనుశ్లోకముచేతను, ఏడవభూమికయందు చేరిన యోగి "దేహం చ నశ్వరం" అను భాగవతశ్లోకమువలన చెప్పఁబడినందున నీరెండు శ్లోకములకు పరస్పరవిరుద్ధము లేదని తెలియవలయును. ఇంతవరకు చెప్పిన భూమికాసప్తకమును గూర్చి సంగ్రహమును చెప్పెదము. పంచమాదిభూమికాత్రయరూపమైన జీవన్ముక్తి సంపాదింపఁబడినపక్షమునందు ద్వైతప్రపంచప్రతిభాసము లేనందున సంశయవిపర్యయములు సంభవించవు గనుక వేదాంతప్రమాణమువలనఁబుట్టిన తత్త్వజ్ఞానము బాధించఁబడక రక్షిం

చఁబడును. ఇట్టితత్త్వజ్ఞానరక్షణము జీవన్ముక్తికి మొదటిప్రయోజనము. రెండవ ప్రయోజనము తపస్సు, యోగభూమికలు దేవత్వాదిప్రాప్తికి హేతువు లగుటచేత తపస్సని తెలియవలెను.

యోగభూమికలు దేవత్వాదిప్రాప్తిసాధనము లనుసర్థము శ్రీకృష్ణార్జునులయొక్కయు రామవసిష్ఠులయొక్కయు ప్రశ్న ప్రతివచనములచేతఁ దెలియఁబడుచున్నది.

అర్జునుఁ డడిగిన ప్రశ్న.

శ్లో. అయతిః శ్రద్ధయోపేతః యోగాచ్చలితమానసః,
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి.

తా. మోక్షమార్గమునందు అల్పప్రయత్నమును జేసిన పురుషుఁడు గురువేదాంతవాక్యములయందు శ్రద్ధయును శమదమాదిగుణములును కలవాఁడై గురుసమీపమునకుఁ బోయి వేదాంతవాక్యశ్రవణమును చేయుచుండి తత్త్వసాక్షాత్కారమును బొందకయే మధ్యకాలమునందు మృతిఁ బొందిన నేమిగతిని బొందును?

శ్లో. కచ్చిన్నోభయవిభ్రష్టః ఛిన్నాభ్రమివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి.

తా. బ్రహ్మాత్మైక్యజ్ఞానము లేనివాఁడైనందున ముక్తిని బొందక కర్మలను ఉపాసనలను విడిచినందున స్వర్గలోక బ్రహ్మలోకములను బొందక ఉభయభ్రష్టుఁడై చెదరిపోయిన మేఘశకలమువలె నశించిపోఁడుగదా.

అనఁగా స్వర్గప్రాప్తిసాధనములైన యాగదానాదికా మ్యకర్మలను బ్రహ్మలోకప్రాప్తిసాధనములైన పంచాగ్నివిద్యాద్యుపాసనలను విడిచి నిష్కామకర్మయోగము ననుష్ఠించి దాని వలన నిర్మలమైన చిత్తము కలవాఁడై శమదమాదిగుణములు గలిగి మోక్షమునం దిచ్ఛగలవాఁడయి పరమహంససన్న్యాసాశ్రమము నంగీకరించి శ్రోత్రియబ్రహ్మనిష్ఠ గురుసన్నిధియందు వేదాంతశాస్త్రమును యథావిధిగా శ్రవణముచేసి మనన నిదిధ్యాసనముల నాచరించు పురుషుఁడు అద్వితీయబ్రహ్మసాక్షాత్కారము గలుగులోపల కాలగతిచేత మరణము నొందిన పక్షమునకు తత్త్వసాక్షాత్కారము లేనందున వానికి మోక్షము నిశ్చయముగా లేదు. కర్మోపాసనలను విడిచినందున స్వర్గలోక బ్రహ్మలోకములును లేవు. వేదోక్తకర్మలను విడిచినందున నరకము ప్రాప్తించునా? లేక శ్రవణము మొదలగు అనిషిద్ధకర్మల నాచరించుచున్నందునను, సురాపానాదినిషిద్ధకర్మల నాచరించనందునను స్వర్గాదిపుణ్యలోకములే ప్రాప్తించునా యని ప్రశ్నతాత్పర్యము.

ఇందులకు శ్రీకృష్ణమూర్తిచే చెప్పఁబడినయుత్తరము.

శ్లో. పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే,
నహి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి.

తా. ఓయర్జునా, బ్రహ్మవిద్యావిచారము చేయు పురుషుఁడు ఈలోకమునందుఁగాని పరలోకమునందుఁగాని చెరుపును పొందఁడు. పుణ్యకార్యములను జేయువానికి ఈలోకమున నపకీర్తి గాని పరలోకమునందు నరకము గాని కలుగనేరదు.

శ్లో. ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే.

తా. బ్రహ్మసాక్షాత్కారముకొఱకు ప్రయత్నముచేయుచు బ్రహ్మసాక్షాత్కారముకలుగక ముందే మృతిఁ బొందిన పురుషుఁడు మృతికాలమునందు భోగవాసనలు కలవాఁడై మరణమును బొందెనా, మరణానంతరము అశ్వమేధాది మహాపుణ్యకార్యములను చేసిన మహానుభావులు పొందు బ్రహ్మలోకాదిలోకములను అర్చిరాదిమార్గమువలనఁ బ్రవేశించి యచ్చట సమస్తభోగములను చిరకాల మనుభవించి తరువాత నీలోకమునం దాచారవంతులై మహాసామ్రాజ్యముగల క్షత్రియోత్తములవంశములయందు జన్మించును.

ఇట్టిజన్మ జనకాదులకుఁ గలదు.

శ్లో. అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్.

తా. భోగవాసనలు లేకయే కేవలముగా మృతి నొందెనా, మరణానంతర మవ్యవహితకాలమునందే బ్రహ్మతత్త్వాభ్యాసపరులైన బీదబ్రాహ్మణులయొక్క వంశములయందు శ్రీశుక జడభరతాదులవలె జన్మించును. సదాచారసామ్రాజ్యములుగలరాజవంశములయందు జన్మించుట దుర్లభము. బ్రహ్మతత్త్వాభ్యాసపరదరిద్ర బ్రాహ్మణవంశములయందు జన్మించుట యంతకంటె నిండ దుర్లభము.

శ్లో. తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం,
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన.

తా. పూర్వజన్మమందు బ్రహ్మతత్త్వజ్ఞానమును ఏభూమికవరకు నభ్యసించియుండెనో, యాభూమికను ప్రయత్నము లేకయే పొందును. అంతకు పైబడిన భూమికను బొందుటకు ప్రయత్నము చేయును. అనఁగా సాధనచతుష్టయసంపత్తిగురూపసదనవేదాంతవాక్యశ్రవణమననదిధ్యాసనము లనెడి అయిదు భూమికలలో నే భూమికవరకు అభ్యసించి మృతిఁ బొందెనో ఆభూమికను ఉత్తరజన్మమందప్రయత్నముగాఁ బొంది తదుత్తరభూమికలను సాధించుటకు ప్రయత్నమును చేసి తత్త్వసాక్షాత్కారమును కలుగఁ జేసుకొని ముక్తినొందును.

ఈప్రకారమే వాసిష్ఠరామాయణములో కూడ శ్రీరామవసిష్ఠసంవాదమువలన నిరూపింపఁ బడియున్నది.

అచ్చట శ్రీరాములవారు చేసిన ప్రశ్న.

శ్లో. ఏకామథ ద్వితీయాం వా తృతీయాం భూమికాముత,
ఆరూఢస్య మృతస్యాథ కీదృశీ భగవన్ గతిః.

తా. ఓస్వామీ సత్త్వాపత్తి యను నాలుగవ జ్ఞానభూమికను బొందినవానికి విదేహకైవల్యము నిశ్చయముగాఁగలదు కాని శుభేచ్ఛ యను మొదటిభూమికను గాని విచారణ యను రెండవభూమికను గాని తనుమానస యను మూడవ భూమికనుగాని పొంది, అచ్చటనే మృతినొందినవానికి ఏమిగతి గలుగును?

ఈప్రశ్నయొక్క తాత్పర్యమును పూర్వము అర్జునుని ప్రశ్నతాత్పర్యమును వలె నూహించవలయును.

ఇందుకు వసిష్ఠమహర్షిచే చెప్పఁబడిన ప్రత్యుత్తరము.

శ్లో. యోగభూమికయోత్క్రాన్తజీవితస్య శరీరిణః,
భూమికాంశానుసారేణ క్షీయతే పూర్వదుష్కృతం.

తా. ఓరామచంద్రా, మొదటియోగభూమికలు మూఁటిలో నొకదానియందుండి మృతినొందినవానికి ఆయాభూమికాస్వభావము ననుసరించి పూర్వపాపములు నశించును. అనఁగా మొదటిభూమికలో నుండి మృతినొందినవానికి కొంచెము పాపమును రెండవభూమికలో నుండి మృతినొందినవానికి మరికొంత యెక్కువపాపమును మూఁడవభూమికలో నుండి మృతినొందినవానికి ఇంక నెక్కువపాపమును నశించు నని భావము.

శ్లో. తత స్సురవిమానేషు లోకపాలపురేషు చ,
మేరూపవనకుంజేషు రమతే రమణీసఖః.

తా. దుష్కృతనాశతారతమ్యము ననుసరించి దేవతలవిమానములయందు ఇంద్రాదిలోకపాలకులపట్టణములయందు మేరుపర్వతదివ్యోద్యానములయందును రంభాద్యప్సరసలతో క్రీడించును.

శ్లో. తత స్సుకృతసంభారే దుష్కృతే చ పురాకృతే,
భోగక్షయపరిక్షీణే జాయంతే యోగినో భువి,
శుచీనాం శ్రీమతాం గేహే గుప్తే గుణవతాం సదా.

తా. ఈప్రకారముగా ననేకసంవత్సరములు క్రీడించినతరువాత పూర్వజన్మకృతపుణ్యమును పాపమును నశించఁగానే తిరిగి భూమిలో సదాచారసంపన్నులయి మహారాజైశ్వర్యముగల క్షత్రియోత్తములవంశములో జన్మించుదురు.

శ్లో. తత్ర ప్రాగ్భవవాభ్యస్తం యోగభూమిత్రయం బుధః,
ప్రాప్యోపరితనామున్చైః క్రమాదాప్నోతి భూమికాం.

తా. ఆజన్మమందు పూర్వజన్మములో నభ్యసించినభూమికలను అనాయాసముగ లభించి వాటికి పైభూమికలను సాధనాభ్యాసక్రమముచే పొందును.

ఇందుచేత యోగభూమికలు పుణ్యలోకప్రాప్తిసాధనములని తెలియఁబడుచున్నది.

ఆక్షేపము—ఓయీ, యోగభూమికలు మీరు చెప్పిన ప్రకారము బ్రహ్మలోకాదిపుణ్యలోకములను పొందించుటకు సాధనము లని యంగీకరించఁదగియున్నది కాని యీయోగభూమికలు తపస్సని చెప్పుటకు మాత్రము ప్రమాణమును గానము.

సమాధానము—ఇందుకు ప్రమాణము శ్రుతివాక్యమే యని చెప్పెదము. అట్టిశ్రుతివాక్యమును ఉదాహరించెదము.

తైత్తిరీయ శాఖయందు.

శ్రు. తపసా దేవా దేవతా మగ్ర ఆయన్ తపసర్షయస్సువరన్వవిందన్.

తా. పూర్వకల్పమునందు కొందఱు పురుషులు దేవత్వమును పొంద నిచ్ఛగలవారై తపస్సు నాచరించి యీకల్పముయొక్క మొదటను దేవత్వమును బొందిరి. భృగ్వాదిఋషులు తపస్సుచేతనే స్వర్గలోకమును బొంది రని శ్రుత్యర్థము.

తత్త్వజ్ఞానోత్పత్తికి పూర్వమం దున్నమూఁడుభూమికలు తపస్సని చెప్పఁబడుచుండఁగా తత్త్వజ్ఞానోత్తరకాలమం దున్న

పంచమాదిభూమికాత్రయము నిర్వికల్పసమాధిరూపమయిన దుస తపస్సని నిస్సంశయముగా చెప్పఁదగియున్నది.

కనుకనే స్మృతియందు చెప్పియున్నది.

శ్లో. మనసశ్చేంద్రియాణాం చ ఐకాగ్ర్యం పరమం తపః,
తజ్జ్యాయస్సర్వధర్మేభ్యః స ధర్మః పర ఉచ్యతే. అని.

తా. మనస్సు, చక్షురాదీంద్రియములు ఏకాగ్రములై ఉండుటయే శ్రేష్ఠమయిన తపస్సు. ఇది సర్వధర్మములకంటె ఉత్తమమైన ధర్మము. ఇదియె పరమధర్మ మని మునులచేఁ జెప్పఁబడినది.

విచారింపఁగా ఈన్యాయప్రకార మీతపస్సుచేత పొందఁదగిన జన్మాంతరము లేదు. అయినను లోకసంగ్రహాము కొఱ కీనిర్వికల్పసమాధి తపస్సని చెప్పఁబడినది.

కనుకనే భగవద్గీతలయందు శ్రీ కృష్ణమూర్తిచేఁ జెప్పఁబడినది.

శ్లో. లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి. అని.

తా. లోకసంగ్రహాము నైనను నపేక్షించి నిష్కామ కర్మయోగాదియోగములను ఉత్తమాధికారి అనుష్ఠింపవలయు నని భావము.

లోకసంగ్రహ మనఁగా సన్మార్గమునందు లోకులను ప్రవర్తింపఁజేయుట. ఇట్టిసన్మార్గమందుఁ బ్రవర్తింపఁజేయఁదగిన లోకులు శిష్యుఁడని భక్తుఁడని తటస్థుఁడని మూఁడువిధములు. శిష్యుఁడు యోగాభ్యాసరతుఁడైన గురువు అంతర్ముఖుఁడై

పంచమాదిభూమికాత్రయము నిర్వికల్పసమాధిరూపమయినం దున తపస్సని నిస్సంశయముగా చెప్పఁదగియున్నది.

కనుకనే స్మృతియందు చెప్పియున్నది.

శ్లో. మనసశ్చేంద్రియాణాం చ ఐకాగ్ర్యం పరమం తపః,
తజ్జ్యాయస్సర్వధర్మేభ్యః స ధర్మః పర ఉచ్యతే. అని.

తా. మనస్సు, చక్షురాదీంద్రియములు ఏకాగ్రములై ఉండుటయే శ్రేష్ఠమయిన తపస్సు. ఇది సర్వధర్మములకంటె ఉత్తమమైన ధర్మము. ఇదియె పరమధర్మ మని మునులచేఁ జెప్పఁబడినది.

విచారింపఁగా ఈన్యాయప్రకార మీతపస్సుచేత పొందఁదగిన జన్మాంతరము లేదు. అయినను లోకసంగ్రహాము కొఱకే నిర్వికల్పసమాధి తపస్సని చెప్పఁబడినది.

కనుకనే భగవద్గీతలయందు శ్రీ కృష్ణమూర్తిచేఁ జెప్పఁబడినది.

శ్లో. లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి. అని.

తా. లోకసంగ్రహాము నైనను నపేక్షించి నిష్కామకర్మయోగాదియోగములను ఉత్తమాధికారి అనుష్ఠింపవలయునని భావము.

లోకసంగ్రహ మనఁగా సన్మార్గమునందు లోకులను బ్రవర్తింపఁజేయుట. ఇట్టిసన్మార్గమందుఁ బ్రవర్తింపఁజేయఁదగిన లోకులు శిష్యుఁడని భక్తుఁడని తటస్థుఁడని మూఁడువిధములు. శిష్యుఁడు యోగాభ్యాసరతుఁడైన గురువు అంతర్ముఖుఁడై

యుండెనా, అట్టి గురువునందు ప్రామాణికత్వబుద్ధి విశేషముగాఁ గలిగి యాగురువుచేత నుపదేశింపఁబడిన తత్త్వార్థమునందు పరమవిశ్వాసము గలవాఁడై శీఘ్రముగా చిత్తవిశ్రాంతిని బొందును.

కనుకనే శ్రుతియందీప్రకారము చెప్పఁబడినది.

శ్రు. యస్యదేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ,
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః. అని.

తా. ఎవనికి పరమేశ్వరునియందు పరమభక్తి కలిగి యుండునో, పరమేశ్వరునియందువలె గురువునందు కూడ పరమభక్తిగలిగియుండునో, అట్టి మహాత్ముఁడయినవానికి గురువువలన నుపదేశింపఁబడినయర్థములు విస్పష్టముగా ప్రకాశించును.

ఈయర్థము స్మృతిలో కూడ చెప్పఁబడియున్నది.

శ్లో. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి. అని.

తా. బాహ్యేంద్రియాంతరింద్రియనిగ్రహముగల పురుషుఁడు గురువునందును గురూపదిష్టార్థమునందును శ్రద్ధకలవాఁడై తత్త్వజ్ఞానమును పొందును. తత్త్వజ్ఞానమును పొంది త్వరలోనే సర్వాధికమైన చిత్తవిశ్రాంతిని పొందును.

ఇంకను భక్తుఁడగు పురుషుఁడు అన్నప్రదాననివాసకల్పనాదిపూజలవలన యోగిని సేవించి ఆయోగియొక్క తపస్సును తాను గ్రహించును.

ఈయర్థము శ్రుతియందు చెప్పఁబడియున్నది.

శ్రు. తస్య పుత్రా దాయముపయంతి. సుహృదస్సాధుకృత్యాం. ద్విషంతః పాపకృత్యాం. అని.

తా. అతత్త్వజ్ఞుఁడగు యోగియొక్క గృహక్షేత్రాదిద్రవ్యమును పుత్రులు గ్రహింతురు; అన్నదానాదిపూజలచేత వారిని ఆదరించు సజ్జనులు వారియొక్క పుణ్యమును గ్రహింతురు. అధిక్షేపతిరస్కారపరిహాసాదులవలన యోగుల ననాదరించువారు ఆ యోగులయొక్క పాపకృత్యములను గ్రహింతు రని యర్థము.

తటస్థుఁడగువాఁడు ఆస్తికుఁడని నాస్తికుఁడని రెండు విధములు. ఆస్తికుఁ డనఁగా పరలోకము కలదని, ఈశ్వరుఁడు కలఁడని వేదశాస్త్రములు సత్యము లని జ్ఞానము కలవాఁడు. నాస్తికుఁ డనఁగా ఇవియేవియు లే వనువాఁడు. ఇందులో ఆస్తికుఁడు యోగియొక్కసన్మార్గానుష్ఠానమును జూచి తాను కూడ అట్టి సన్మార్గమునందు సంచరించుచుండును.

శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే. అని.

తా. ఈలోకములో ప్రసిద్ధుఁడై శ్రేష్ఠుఁడైన పురుషుఁడు ఏయేధర్మము నాచరించునో ఆధర్మమునే యప్రసిద్ధులయిన జనులు సాధారణముగా నాచరించుదురు. ఇదిగాక యాప్రసిద్ధుఁడు ధర్మము నాచరించునప్పుడు ఎంత శ్రద్ధాభక్తులతోటి యెన్ని అంగోపాంగములతో నాచరించునో లోకు లందఱు నదేప్రకారముగ నాచరించుచుందురు.

ఇఁక నాస్తికుఁడు యోగిచేత చూడఁబడి సర్వపాపములు నశించి పవిత్రుఁ డగును.

ఈయర్థము పురాణములో చెప్పఁబడియున్నది.

శ్లో. యస్యానుభవపర్యంతా తత్త్వే బుద్ధిః ప్రవర్తతే,
తద్దృష్టిగోచరాస్సర్వే ముచ్యంతే సర్వపాతకైః.

తా. ఏపురుషునియొక్క బుద్ధి పరమార్థతత్త్వమైన పరబ్రహ్మస్వరూపమునందు సాక్షాత్కారపర్యంతము వ్యాపించునో, అట్టి మహాపురుషునియొక్క కటాక్షమునకు గోచరించిన మనుష్యు లందఱు సమస్తపాపములచేత విడువఁబడి పరమపవిత్రులై సమస్తపుణ్యములను బొందుదురు.

శ్లో. ఈక్షణధ్యానసంస్పర్శై ర్మత్స్యకూర్మవిహంగమాః,
పోషయంతి స్వకాన్ పుత్రాన్ తద్వత్పండితవృత్తయః.

తా. లోకములో మత్స్యములు, కూర్మములు, పక్షులు తమతమబిడ్డలను దర్శనముచేత ధ్యానముచేత స్పర్శచేతను ఏప్రకారముగా పోషించునో యాప్రకారమే బ్రహ్మతత్త్వజ్ఞానముగల యోగులు కూడ లోకుల ననుగ్రహించి రక్షించెదరు. అనఁగా మత్స్యములు తమపిల్లలను కన్నులతో చూచినమాత్రాన రక్షించును. కూర్మములు బిడ్డలను మనస్సులో తలఁచినమాత్రాన రక్షించును. పక్షులు స్పర్శనమును చేసినమాత్రాన పిల్లలను రక్షించును. ఇదేప్రకారము సత్పురుషులైన యోగులు మందాధికారులను దృష్టిచేతను మధ్యమాధికారులను మనస్సులో వీరు కృతార్థు లగుదురు గాక యని ధ్యానించుటచేతను ఉత్తమాధికారులను హస్తమస్తకసంయోగరూపమయిన స్పర్శచేత ననుగ్రహించి రక్షించెదరని తాత్పర్యము.

ఈప్రకారముచేత సర్వవిధోపకారిత్వము యోగియందు కల దని అభియుక్తులచేఁ జెప్పఁబడినది.

శ్లో. స్నాతం తేన సమస్తతీర్థసలిలే సర్వాపి దత్తాఽవనిః
యజ్ఞానాం చ సహస్రమష్టమఖిలా దేవాశ్చ సంతర్పితాః,
సంసారాచ్చ సముద్ధృతాస్స్వపితరః త్రైలోక్యపూజ్యోఽప్యయం
యస్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్.

తా. ఎవనియొక్క చిత్తము పరబ్రహ్మవిచారమందు నిమిషకాలమైనా స్థిరమైయుండునో అట్టి మహానుభావుఁడు గంగాయమునాదిసమస్తపుణ్యతీర్థములయందు స్నానము చేసినవాఁడే. యావత్తుభూమండలమును పాత్రుఁడైన బ్రాహ్మణునకు యోగ్యమైనదేశకాలములయందు దానమును చేసినవాఁడును. ఏకాహయాగముమొదలు సహస్రవార్షికసత్రమువఱకు నెన్ని యాగములు కలవో వాటి నన్నిటిని సమగ్రముగా ననుష్ఠించినవాఁడును హరిహరహిరణ్యగర్భాదిదేవతల నందఱిని సత్కార్యములచేత నానందింపఁజేసినవాఁడును గయాశ్రాద్ధాగులను చేసి తనపితృదేవతలనందఱిని సంసారమండలములోనుండి లేవనెత్తి బ్రహ్మలోకమును జేర్చినవాఁడును మూఁడులోకములయందున్న సమస్తజనులచేత పూజింపఁ బడువాఁడును అగును.

శ్లో. కులం పవిత్రం జననీ కృతార్థా విశ్వంభరా పుణ్యవతీ చ తేన,
అపారసంవిత్సుఖసాగరేఽస్మిన్ లీనం పరే బ్రహ్మణి యస్య చేతః.

తా. ఎవనియొక్కచిత్తము అపరిచ్ఛిన్నజ్ఞానానందస్వరూపుఁడయిన పరమాత్మయందు సుస్థిరమై యుండునో, వాని

కులము పవిత్రముగా నుండును. తల్లి కృతార్థురా లగును. వానిచేతనే భూమి యంతయు పుణ్యము గలదిగా నుండును.

యోగియొక్క శాస్త్రీయవ్యవహారముమాత్రమే తపస్సుగా చెప్పఁబడలేదు. లౌకికవ్యవహారములైన గమనాసనభోజనాదులు కూడ తపస్సుగానే చెప్పఁబడుచున్నవి. తైత్తిరీయశాఖయందు మొదటి అనువాకములో తత్వజ్ఞానియొక్క మహిమ చెప్పఁబడియున్నది. ఆయనువాకముయొక్క మొదటిభాగములో తత్వజ్ఞానియొక్క అవయవములు యజ్ఞాంగములుగా నిరూపింపఁబడినవి.

శ్రు. తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా యజమానః శ్రద్ధా పత్నీ శరీరమిధ్మముఱో వేదిర్లోమాని బర్హిర్వేదశ్శిఖా హృదయం యూపః కామ ఆజ్యం మన్యుః పశుః తపోఽగ్నిర్దమశ్శమయితా దక్షిణా వాగ్ఘోతా ప్రాణ ఉద్గాతా చక్షురధ్వర్యుర్మనో బ్రహ్మా శ్రోత్రమగ్నీత్. అని.

తా. యజ్ఞస్వరూపుఁడయిన తత్త్వజ్ఞానియొక్క ఆత్మయే యజమానుఁడు. శ్రద్ధయే పత్ని (అనఁగా యజమానుని యొక్కభార్య). శరీరమే ఇధ్మము (సమిధలయొక్క సముదాయము). వక్షస్స్థలమే వేదిక (అగ్నిప్రతిష్ఠాపనస్థానము). వెంట్రుకలె దర్భలు. వేదమే శిఖయను యజ్ఞాంగము. హృదయమే యూపస్తంభము. కామమే ఆజ్యము (నెయ్యి). కోపమే యజ్ఞమందు హింసింపఁబడు పశువు. ఆలోచనమని చెప్పఁబడు తపస్సు, జ్ఞానము అగ్ని. అంతరింద్రియనిగ్రహబాహ్యేంద్రియనిగ్రహమను దమమే పశువును హింసించుశమయిత. దానమే దక్షిణ.

ఇచ్చట దానమను పదము లేకపోయినా శ్రు. 'అథ యత్తపో దానమార్జవమహింసా సత్యవచనమితి తా అస్య దక్షిణా' యను ఛాందోగ్యశ్రుతి ననుసరించి దానశబ్దమును అధ్యాహార మును చేయవలయును. తపస్సు దానము అకౌటిల్యము అహింస సత్యవచనము (యథార్థభాషణము) ఇవి దక్షిణ యని ఛాందోగ్యశ్రుత్యర్థము. వాగింద్రియము హోత యను ఋత్విజుఁడు. ప్రాణము ఉద్గాతయను ఋత్విజుఁడు. చక్షురింద్రియము అధ్వర్యుఁడను ఋత్విజుఁడు. మనస్సు బ్రహ్మయను ఋత్విజుఁడు. శ్రోత్రేంద్రియము అగ్నిధ్రుఁడను ఋత్విజుఁడు.

ఉక్తానువాకముయొక్క మధ్యమభాగములో యోగి యగు తత్త్వజ్ఞునియొక్క వ్యాపారములు జీవితకాలములును జ్యోతిష్టోమావయవములుగాను పౌండరీకాద్యుత్తరక్రతువుల యొక్క అవయవములుగాను చెప్పఁబడినవి.

శ్రు. యావద్ధ్రియతే సా దీక్షా యదశ్నాతి తద్ధవి ర్యత్పిబతి తదస్య సోమపానం యద్రమతే తదుపసదః యత్సంచరత్యుపవిశత్యుత్తిష్ఠతే చ స ప్రవర్గ్యో యన్ముఖం తదాహవనీయో యా వ్యాహృతిరాహుతి ర్యదస్య విజ్ఞానం తజ్జుహోతి యత్సాయం ప్రాతరత్తి తత్సమిథం యత్ప్రాత ర్మధ్యందిసం సాయంతనం చ తాని సవనాని యే అహోరాత్రే తే దర్శపూర్ణమాసౌ యే అర్ధమాసాశ్చ మాసాశ్చ తే చాతుర్మాస్యాని య ఋతవస్తే పశుబంధాః యే సంవత్సరాశ్చ పరివత్సరాశ్చ తేఽహర్గణాః సర్వవేదసం వా ఏతత్సత్రం యన్మరణం తదవభృథః. అని.

తా. తత్త్వజ్ఞానియొక్క అవధారణము (నిశ్చయము) ఏదికలదో అదియే దీక్షయని చెప్పఁబడును. తత్త్వజ్ఞానియొక్క

భోజనము హవిస్సని (హోమద్రవ్య మని), జలపానము సోమ పాన మని, క్రీడావ్యాపారములు ఉపసత్తులనెడి యిష్టివిశేషమ లని, సంచారోపవేశోత్థానములు మూడు ప్రవర్గ్యలనెడి యి విశేషము లని, ముఖము ఆహవనీయమనెడి అగ్నియని, సంభా షణము ఆహుతి యని, విజ్ఞానము హోమ మని, సాయంకా ప్రాతఃకాలములయందు చేయు భక్షణము సమిద్యాగ మని ప్రాతఃకాలమధ్యాహ్నకాలసాయంకాలములు మూడు మూడు సవనము లని, అహోరాత్రములు దర్శపూర్ణమాసము లని పక్షములును మాసములును చాతుర్మాస్యయాగములని, వస తాదిఋతువులాఋను పశుబంధను లని, సంవత్సరపరివత్సరమ లు అహర్గణము లని చెప్పఁబడును. అహోరాత్రములు మొ లు సంవత్సరపరివత్సరములవఱకు చెప్పిన కాలావయవములతో గూడిన తత్త్వజ్ఞునియొక్క ఆయుష్కాలమును సర్వస్వమున దక్షిణగా నియ్యఁదగిన సత్రయాగమని చెప్పెదరు. కనుక తత్త్వజ్ఞానియొక్క మరణమే యీసత్రయాగమున కవభృ మని చెప్పఁబడును.

ఉత్తరానువాకముయొక్క చరమభాగములో తత్త్వజ్ఞ నిచరిత్రమును సర్వయజ్ఞస్వరూపముగా నుపాసించువానికి సు ర్యచంద్రులను కార్యబ్రహ్మలయొక్క తాదాత్మ్యరూపమైన క్ర మమోక్షము ఫలించు నని చెప్పఁబడినది.

శ్రు. ఏతద్వై జరామర్య మగ్నిహోత్రం సత్రం య ఏవం విద్వా దగయనే ప్రమీయతే దేవానా మేవ మహిమానం గత్వాదిత్యస సాయుజ్యం గచ్ఛతి అథ యో దక్షిణే ప్రమీయతే పితౄణాం వే

మహిమానం గత్వా చంద్రమసస్సాయుజ్యగ్ం సమానలోకతామా ప్నోతి ఏతౌ వై సూర్యాచంద్రమసోర్మహిమానౌ బ్రాహ్మణో విద్వా నభిజయతి తస్మాద్బ్రహ్మణో మహిమానమాప్నోతి తస్మాద్బ్రహ్మణో మహిమానమిత్యుపనిషత్. అని.

తా. జరామరణములవరకు ఈచెప్పఁబడిన యోగియొక్క వ్యాపారములను అగ్నిహోత్రాదిసహస్రవార్షిక సత్రాంతయజ్ఞస్వరూపమునుగా నెవ్వఁ డుపాసించునో, ఆయుపాసకుఁడు ఉపాసనాప్రకర్షము నొంది ఉత్తరాయణమునందు మరణమునొందెనా, దేవతలప్రభావమువంటి ప్రభావము కలవాఁడై సూర్యునియొక్క తాదాత్మ్యమును బొందును. దక్షిణాయనమందు మరణము నొందెనా, పితృదేవతలతో సమానమైన ప్రభావముగలవాఁడై చంద్రునియొక్క తాదాత్మ్యమును బొందును. ఉపాసనము మందముగా నుండఁగా మరణము నొందెనా, ఉత్తరాయణదక్షిణాయనమరణానుసారముగ సూర్యచంద్రులయొక్క లోకములకు పోయి ఆలోకములయందు సూర్యచంద్రులయొక్క ఐశ్వర్యమును కొంతకాల మనుభవించి తరువాత సత్యలోకమునందు చతుర్ముఖబ్రహ్మయొక్క మహిమను బొందును. ఆబ్రహ్మలోకమునందు తత్త్వజ్ఞానమును బొంది అనంతరము సత్యజ్ఞానానందాత్మకమైన పరబ్రహ్మయొక్క తాదాత్మ్యమును కైవల్యమనుదానిని బొందును.

ఈప్రకారము జీవన్ముక్తికి రెండవప్రయోజనము తపస్సని యేర్పడినది.

జీవన్ముక్తికి మూడవప్రయోజనము విసంవాదాభావము. అనఁగా నితరజనులతో వివాదము లేకపోవుట. అంతర్ముఖుఁడై బాహ్యవ్యవహారములను చూడకయుండెడి యోగీశ్వరుని విషయమై లౌకికపురుషుఁడుగాని శాస్త్రవేత్తయగుపురుషుఁడుగాని యెవఁడును వివాదమును బొందఁడు గదా.

విసంవాదము కలహ మని నింద యని రెండువిధములు. ఇందులో క్రోధాదివాసనలు నశించి శుద్ధసత్వప్రధానుఁడైన యోగితో లౌకికపురుషులు కలహించుట కవకాశమే యుండనేరదు.

తత్త్వజ్ఞానముగల యోగి క్రోధాదిరహితుఁడై యుండునని స్మృతియందు చెప్పఁబడియున్నది.

శ్లో. క్రుధ్యంతం న ప్రతిక్రుధ్యేదాక్రుష్టః కుశలం వదేత్,
అతివాదాం స్తితిక్షేత నావమన్యేత కంచన. అని.

తా. యోగాభ్యాసపరుఁడైన పురుషుఁడు తనయందు కోపగించుకొనువానినిగూర్చి తిరిగి కోపగించుకొనఁగూడదు. ఇతరులచేత నాగ్రహావచనములు పలుకఁబడినవాఁడై ఆయాక్రోశవచనము లన్నియు తనకు కుశలవాక్యము లని పలుకవలయును. అధిక్షేపవచనములను (ఇతరులు తన్ను తిట్టుటను) సహించవలయును. ఎటువంటి మనుష్యునినైన అవమానపఱచఁగూడదు.

ఆక్షేపము—ఓయీ జీవన్ముక్తికి పూర్వమే విద్వత్సన్న్యాసమేర్పడినది. అంతకు పూర్వమే తత్త్వజ్ఞానము కలిగియుండెను. తత్త్వజ్ఞానమునకు పూర్వమే వివిదిషాసన్న్యాస మాచరింపఁ

బడి యుండెనుగదా. ఈజీవన్ముక్తిదశయందు క్రోధరాహిత్యా
ధర్మములు ఏప్రకారము స్మరింపఁబడుచున్నవి?

సమాధానము—వాస్తవము. కనుకనే జీవన్ముక్తునియం
దు క్రోధాదు లుండునా యని శంకించుటకు కూడ నవకాశమ
లేదు. జీవన్ముక్తికి చాల ప్రాచీనకాలమం దనుష్ఠించఁబడిన వి
దిషాసన్న్యాసమునందే క్రోధాదులు ప్రసక్తములు కాక యు
డఁగా సర్వోత్తమపదమయిన తత్వజ్ఞానదశయందు క్రోధాద
లేప్రకారము సంభవించును? తత్త్వజ్ఞానదశయందే సంభవింప
క్రోధాదులు విద్వత్సన్న్యాసమందుఁగాని జీవన్ముక్తియందుఁ గా
బొత్తుగా ప్రసక్తములు కానేరవు. కనుక వివిదిషాసన్న్య
మునం దభ్యసించఁబడి జీవన్ముక్తిదశవరకు అనువర్తించి వచ
క్రోధరాహిత్యాదులనిచ్చట నుదాహరించినస్మృతివాక్యము చే
ననువదింపఁబడుచున్నవి గాని విధింపఁబడలేదు.

కనుక తత్వజ్ఞుఁడగు యోగితో లౌకికపురుషున కెం
టికిని కలహము సంభవించనేరదు.

నిందించఁదగిన విషయము యోగియందు లేనందు
నిందారూపమయిన విసువాదము కూడ లౌకికపురుషున
యోగియందు సంభవించదు.

ఈయర్థము కూడ ఒకస్మృతియందుఁ దెలుపఁబడియున్నది

శ్లో. యన్న సంతం నచాసంతం నాశ్రుతం న బహుశ్రుతం,
న సువృత్తం న దుర్వృత్తం వేద కశ్చిత్స బ్రైహ్మణః. అని.

తా. ఏపురుషుఁడు మరియొకపురుషుని ఉత్తమజా
కలవాఁడని గాని హీనజాతికలవాఁడని గాని మూర్ఖునిగాఁగా

పండితునిగాఁగాని మంచియాచారముగలవానిఁగాఁగాని దురాచారము గలవానిఁగాఁగాని యెఱుఁగఁడో అట్టిపురుషుఁడే యతి యని జీవన్ముక్తుఁడని చెప్పఁబడును.

అనఁగా అన్యులయందు నీచోత్తమాదిభేదబుద్ధి గలిగి వ్యవహరించువానితో కలహించుట కవకాశము గలిగియుండును. సర్వత్ర సమబుద్ధి గలిగి వ్యవహరించు జీవన్ముక్తపురుషునితో కలహించుట కెవరికి నవకాశము గలుగ దని తాత్పర్యము.

ఇఁకను శాస్త్రజ్ఞుఁడగువాఁడును యోగితో విసంవాదమును బొందఁడు.

శాస్త్రజ్ఞుఁడు యోగితో శాస్త్రార్థమందు వివాదమును పొందునా? లేక యోగియొక్క చరిత్రమందు విసంవాదమును బొందునా?

శ్రు. తమేవైకం జానథాత్మానమన్యా వాచో విముంచథ,
నానుధ్యాయేద్బహూఞ్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్.

అనుశ్రుతుల ననుసరించి యోగీశ్వరుఁడు పరశాస్త్రప్రమేయములను దూషింపఁడు గనుక శాస్త్రవేత్తకు యోగితో శాస్త్రప్రమేయమందు విసంవాదము సంభవింపదు. పరశాస్త్రప్రమేయములను దూషించినఁగదా పరశాస్త్రవేత్తలు కలహింతురు. ద్యుభూమ్యాది ప్రపంచమున కధిష్ఠానమైన యా పరమాత్మ నొకనినే తెలుసుకొనుఁడీ. ఇతరమైన వాక్యములను విడువుఁడీ. బ్రహ్మజ్ఞానోపయుక్తములు గాని వాక్యముల నన్నిటిని విడువవలయును. ఇతరవాక్యముల నుచ్చరించుట వాగిం

ద్రియోమున కాయాసమే కదా యని ప్రతిద్వయము కర్థము.

ఇదిగాక స్వశాస్త్రప్రమేయమును ప్రతివాదియొక్క యెదుట యోగియగువాఁడు సమర్థింపఁడు. కనుక ప్రతివాదులుగా నుండు శాస్త్రవేత్తలకు యోగితో వివాదము గలుగదు.

ఈయర్థము స్మృతివాక్యముచే చెప్పఁబడియున్నది.

శ్లో. పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రంథమశేషతః,
పరమం బ్రహ్మ విజ్ఞాయ ఉల్కావత్తాన్యథోత్సృజేత్.

తా. ధాన్యమునపేక్షించిన పురుషుఁడు మునుగా చెత్తను పొట్టును ధాన్యముతో కూడ గ్రహించి తరువాత అందులో ధాన్యమును మాత్రము గ్రహించి పొట్టును చెత్తను విడిచినట్లు అధ్యాత్మశాస్త్రమును తెలియఁగోరిన పురుషుఁడు తదర్థముగా నితరశాస్త్రములను గ్రహించి అధ్యాత్మశాస్త్రము బాగుగ తెలిసినతరువాత నితరశాస్త్రముల నన్నిటిని విడువవలయును. చీఁకటిలో నుండు పదార్థమును తెలియఁగోరి దివిటీని చేత తీసుకొన్నవాఁడు ఆపదార్థము కనుపడిన తరువాత దివిటీని విడిచిపెట్టినట్లు పరబ్రహ్మను తెలుసుకొనుటకుఁగాను అధ్యాత్మశాస్త్రమును గ్రహించి బ్రహ్మస్వరూపమును తెలుసుకొని యాయధ్యాత్మశాస్త్రమును కూడ విడువవలయును. ఇదిగాక ప్రతివాదులను కూడ స్వాత్మాభిన్నముగా తలఁచు యోగికి వాదులను జయింపవలె ననునిచ్ఛ సుతరాం ఉండనేరదు. చార్వాకులకంటె ఇతరులయిన శాస్త్రజ్ఞు లందఱు ఆత్మ దేహానతిరిక్తమని, అట్టి ఆత్మ

కు మోక్షమను నిత్యపురుషార్థము కలదని అంగీకరించియున్నం దున యోగియొక్క చరిత్రమునందు విసంవాదమును పొందరు. ఆర్హాత (జైన) బౌద్ధ, వైశేషిక, నైయాయిక, శైవ, వైష్ణవ, శాక్త, సాంఖ్య యోగాది శాస్త్రజ్ఞులందఱు తమ తమశాస్త్ర ములయందు ప్రతిపాదింపఁబడినవిషయము భిన్నభిన్నముగా నున్నప్పటికి మోక్షసాధనమయిన యమనియమాద్యష్టాంగయోగ మును మాత్రము నేకవిధముగా ప్రతిపాదించియున్నందున యోగియొక్క అనుష్ఠానమునందు విసంవాదమును బొందరు. కనుకనే యోగీశ్వరుఁడనిన నిర్వివాదముగా సర్వసమ్మతమై యుండును.

ఈయభిప్రాయముతోనే వసిష్ఠమహర్షి చేఁ జెప్పఁబడినది.

శ్లో. యస్యేదం జన్మపాశ్చాత్యం తమాశ్వేవ మహామతే,
విశంతి విద్యావిమలాః ముక్తా వేణుమివోత్తమం.

తా. ఏమహాపురుషునియొక్క జన్మ చరమజన్మముగ నుండునో, ఆపురుషునిగూర్చి అతిశీఘ్రముగా నిర్మలమైన సకలవి ద్యలు మంచివెదురును గూర్చి ముత్యములు ప్రవేశించినట్టు ప్రవేశించును.

శ్లో. ఆర్యతా హృద్యతా మైత్రీ సౌమ్యతా ముక్తతా జ్ఞతా,
సమాశ్రయంతి తం నిత్య మంతఃపురమివాంగనాః.

తా. ఏయేగుణములు యోగీశ్వరునియందు ప్రవేశిం చుననఁగా, పూజ్యత్వము, సకలజనమనోహరత్వము, సకలలో కమిత్రభావము, చంద్రునివలె ప్రియదర్శనము, సర్వశాస్త్రపర

జ్ఞానము ఇవి మొదలయిన గుణములు స్త్రీజన మంతఃపురము నాశ్రయించినట్లు యోగీశ్వరుని నాశ్రయించును.

శ్లో. పేశలాచారమధురం సర్వే వాంఛంతి తం జనాః,
వేణుం మధురనిధ్వానం వనే వనమృగా ఇవ.

తా. సర్వజనప్రియంకరమైన అనుష్ఠానముచేత నొప్పుచున్న యాతత్త్వజ్ఞుని సకలజనులు కోరుచుందురు. అనఁగా వనమందు మధురముగా ధ్వనిచేయుచున్న బొంగువెదురును విడువఁజాలక వనమృగములు దానిచుట్టు చుట్టుకొని యున్నట్లు సకలజనులు తత్త్వజ్ఞానియొక్క సన్మార్గప్రవృత్తిని జూచి విడువఁజాలక వానిని సర్వకాలసర్వావస్థలయందును చుట్టుకొనియుందురని భావము.

శ్లో. సుషుప్తవత్ప్రశమితభావవృత్తినా
స్థితస్సదా జాగ్రతి యస్స్వచేతసా,
కలాన్వితో విధురివ యస్సదా బుధై
ర్నిషేవ్యతే ముక్త ఇతీహ స స్మృతః.

తా. ఏపురుషుఁడు జాగ్రదవస్థయందు కూడ సుషుప్తిదశయందు వలె సమస్తవిషయాకారవృత్తులను విడిచి కేవలముగా నున్నచిత్తముతో కూడియుండునో సంపూర్ణకళలు గల చంద్రుఁడేప్రకారము దేవతలచేత సేవింపఁబడునో ఆప్రకారమే పండితులచేత సర్వకాలములయందును నేపురుషుఁడు సేవింపఁబడునో, అట్టి పురుషుఁడు ఈలోకములో ముక్తుఁడని చెప్పఁబడును.

శ్లో. మాతరీవ శమం యాంతి విషమాణి మృదూని చ,
విశ్వాసమిహ భూతాని సర్వాణి శమశాలిని.

తా. ఈలోకములో సాధువులు కఠినులు కూడ తమ తల్లియందువలె ప్రకారము విశ్వాసముకలవారై యుందురో యాప్ర కారమే శమము ప్రధానముగాఁగల పురుషునియందు సమస్త భూతములు విశ్వాసమును బొందియుండును.

శ్లో. తపస్విషు బహుజ్ఞేషు యాజకేషు నృపేషు చ,
బలవత్సు గుణాఢ్యేషు శమవానేవ రాజతే.

తా. తపస్సును చేయువారియందు సకలశాస్త్రపాండి త్యము గలవారియందు యాగాదిపుణ్యకార్యములు చేసిన వారి యందు మహారాజులయందు బలవంతులయందు సమస్తసద్గు ణములు కలవారియందును శమగుణము గల పురుషుఁడే యధి కముగా ప్రకాశించును.

ఈచెప్పిన ప్రకారము జీవన్ముక్తికి విసంవాదాభావమను మూడవ ప్రయోజనము నిర్బాధముగా కనుపడుచున్నది.

దుఃఖనాశసుఖావిర్భావముల చతుర్థ పంచమ ప్రయో జనములు బ్రహ్మానంద గ్రంథములోని విద్యానందమను నాలుగవ యధ్యాయమునందు నిరూపింపఁబడియున్నవి. ఆ రెంటిని సంగ్ర హముగా నిచట చెప్పెదము.

శ్లో. ఆత్మానం చేద్విజానీయా దయమస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమను సంజ్వరేత్.

తా. ఏపురుషుఁడు సర్వభూతములయొక్క హృదయముల యందుండి అశనాయాదిదోషశూన్యుఁడైన ఆత్మను నిత్యశుద్ధ బుద్ధముక్తస్వభావుఁడైన పరమాత్మనుగా తెలుసుకొనెనో, ఆ పురుషుఁడు యేప్రయోజనముకొఱకు నేఫలమును కోరి శరీర

ము ననుసరించి పరితాపమును బొందును? అనఁగా అద్వితీయ పరమానందస్వరూపమయిన పరబ్రహ్మను నేనే యని ప్రత్యక్షముగా తెలుసుకొన్నపురుషునకు ఆత్మాతిరిక్తమయి కామింపఁదగిన పదార్థము. లేనందునను ఆత్మస్వరూపవ్యతిరిక్తమయిన ఫలము లేనందునను శరీరము పరితాపము నొందుచున్నప్పటికి పరితాపము గలుగ నేరదు. ఆత్మతత్త్వజ్ఞానము లేక భేద దర్శనపరుఁడైన పురుషుఁడు స్వభిన్నమయినకామ్యపదార్థము స్వవ్యతిరిక్తమయిన ఫలమును కలవాఁడైనందున వాటియొక్క లాభము నుద్దేశించి శరీరము పరితపించుచుండఁగా తానును పరితపించు నని భావము.

ఈశ్రుతిచేత నైహికదుఃఖముయొక్క వినాశము చెప్పఁబడినది. శ్రు. 'ఏతగ్ం హ వా వ న తపతి, కిమహం సాధు నాకరవం, కి మహం పాపమకరవం' అనుశ్రుతి ఆముష్మిక హేతు పుణ్యపాపచింతారూపమయిన దుఃఖముయొక్క నాశమును చెప్పుచున్నది. నేను పుణ్యము నెందువలనఁ జేయకపోతిని. పాపము నెందువలనఁ జేసితిని నను విచారమీతత్త్వజ్ఞానిని పరితపింపఁజేయదని శ్రుత్యర్థము. ఇది జీవన్ముక్తియొక్క నాలుగవ ప్రయోజనము.

అయిదవప్రయోజనము—సుఖావిర్భావము. ఇది మూఁడువిధములు. మొదటిది సర్వకామావాప్తి; రెండవది కృతకృత్యత్వము; మూఁడవది ప్రాప్తవ్యప్రాప్తి; అనఁగా పొందఁదగినదానిని పొందుట. ఇందులో సర్వకామావాప్తి సర్వసాక్షిత్వమని, సర్వత్ర అకామహతత్వమని, సర్వభోక్తృరూపత్వమని

మూడువిధములు. హిరణ్యగర్భుఁడు మొదలు స్థావరమువరకుఁ గల సర్వదేహములయందు ననుగతమైన సాక్షిచైతన్యరూప మయిన యే బ్రహ్మ కలదో అట్టిపరబ్రహ్మను నేనే యని తెలుసు కొనియున్నపురుషుఁడు స్వదేహమందు వలె సర్వదేహముల యందును సర్వకామములకు సాక్షియై యుండును.

ఈయభిప్రాయముతోనే శ్రు. 'సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ, బ్రహ్మణా విపశ్చితా' అనుశ్రుతి ప్రవర్తించినది.

బ్రహ్మతత్త్వజ్ఞానము గలపురుషుఁడు అసంకుచితజ్ఞాన స్వరూపమయిన బ్రహ్మము తానే అయి సకలమయిన కామ ములను పొందు నని శ్రుత్యర్థము. లోకములో భోగము లను భవించఁబడినతరువాత నాభోగములవిషయమయి యిచ్ఛ లేకుండుట యను అకామహతత్వము కామప్రాప్తి యనఁబడును. సర్వభోగములయందు వినాశాదిదోషములను జూచుచున్న తత్త్వజ్ఞానికి సర్వభోగములయం దిచ్ఛ కలుగనందున స ర్వత్ర అకామహతత్వము కలిగియుండును. కనుకనే సార్వభౌ మమహారాజును ఆరంభించి హిరణ్యగర్భునివరకు నుత్తరోత్తర శతగుణాధిక్యముతోఁ జెప్పఁబడినయానందములయందు 'శ్రోత్రి యస్య చాకామహతస్య' అని వినఁబడుచున్నది. సర్వభోగముల యందు నిచ్ఛ లేని శ్రోత్రియుఁడైన విరక్తునికి నీయానందము కల దని శ్రుత్యర్థము.

సద్రూపముచేతను చిద్రూపముచేతను ఆనందరూపముచే తను సర్వపదార్థములయందు ననుగతమయియున్న స్వస్వరూ

ఏవము ననుసంధించువానికి సర్వభోక్తృత్వము కలదని తైత్తిరీయోపనిషత్తులో వినఁబడుచున్నది.

శ్రు. అహమన్న మహమన్నమహమన్నం. అహమన్నాదో౽హమన్నాదో౽హమన్నాదః. అని.

తా. బ్రహ్మతత్త్వజ్ఞానము గలిగి ముక్తినొందినపురుషుఁడు తనకృతార్థత్వమును భావించి విస్మయముతో అద్వితీయమయి, నిరంజనమయిన ఆత్మను నేనే అయినప్పటికి, ఈలోకమునందుఁ గల అన్నమును (భోగ్యమును), అన్నాదుఁడను (భోక్తను) నేనే యని అనుసంధించుచుండు నని శ్రుత్యర్థము.

కృతకృత్యత్వము స్మృతియందు స్మరింపఁబడినది.

శ్లో. జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః,
నైవాస్తి కించిత్కర్తవ్య మస్తి చేన్న స తత్వవిత్.

తా. పరబ్రహ్మతత్వజ్ఞానముచేత తృప్తి నొంది కృతకృత్యుఁడయిన యోగికి కర్తవ్యమయిన విషయము ఏమియు నుండదు. ఉండెనో, అతఁడు తత్త్వవేత్తయే కాఁడు.

శ్లో. యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే.

తా. ఏపురుషుఁడు ఆత్మస్వరూపమునందే రతిగలవాఁడై యుండునో, ఉద్యానాదులయందు రతిగలవాఁడై యుండఁడో, ఆత్మచేతనే తృప్తి నొందునో, ఆహారాదులచేత తృప్తి నొందఁడో, ఆత్మయందే సంతోషము నొందుచుండునో, పుత్రధనాదిప్రాప్తిచే సంతోషము నొందఁడో, అట్టి తత్త్వజ్ఞానియయిన పురుషునకు కర్తవ్యము కొంచెమయినా కలిగియుండదు.

శ్రు. 'అభయం వై జనక ప్రాప్తోఽసి' 'తస్మాత్తత్సర్వమభవత్' 'బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి.'

అనుశ్రుతులచేత ప్రాప్తప్రాప్తవ్యత చెప్పఁబడి యున్నది. ప్రాప్తప్రాప్తవ్యత అనఁగా పొందఁదగిన యర్థము లన్నియు పొందఁ బడియుండుట. ఓజనకమహారాజా, నీవు సర్వపురుషార్థశ్రేష్ఠమ యిన అభయమును మోక్షమును పొందితివి. ఇఁకను నీకు పొం దవలసిన విషయము మరియొకటి లేదు కనుక నే సర్వాత్మకబ్ర హ్మస్వరూపమాయెను. ఏపురుషుఁడు సత్యజ్ఞానానందాద్వితీయ పరమాత్మను నేనే యని ప్రత్యక్షముగా తెలియునో ఆపురు షుఁడు బ్రహ్మయే యగు నని మూఁడు శ్రుతుల కర్థము.

ఆక్షేపము—ఓయీ, యీ చెప్పఁబడిన దుఃఖనాశ సుఖప్రాదుర్భావములు రెండును తత్త్వజ్ఞానముచే సిద్ధించుచుం డఁగా జీవన్ముక్తియొక్క ప్రయోజనము లని చెప్పుట న్యాయ ము కాదు.

సమాధానము— సురక్షితములైన దుఃఖనాశసుఖ ప్రాదుర్భావములు జీవన్ముక్తికి ప్రయోజనము లని మాయభిప్రా యమై యున్నది. అనఁగా తత్వజ్ఞానము పూర్వమే పుట్టియున్న ప్పటికి జీవన్ముక్తిచేత నేప్రకారముగా రక్షింపఁబడునో ఆప్రకా రమే దుఃఖవినాశసుఖప్రాదుర్భావములు కూడ తత్త్వజ్ఞానముచే సిద్ధించినప్పటికి జీవన్ముక్తిచేత రక్షింపఁబడును. ఇట్లు రక్షితము లైన దుఃఖవినాశ సుఖప్రాదుర్భావములు జీవన్ముక్తికి ప్రయోజన ము లని చెప్పుట న్యాయవిరుద్ధము కాదని తాత్పర్యము.

ఆక్షేపము—ఓయీ, యీప్రకారము జీవన్ముక్తి అయిదు ప్రయోజనములు కలిగినదై యుండఁగా సమాహితచిత్తుఁడైన యోగీశ్వరుఁడు లోకవ్యవహారమునందుఁ బ్రవర్తించుచున్న తత్వజ్ఞానికంటె నుత్తముఁడని చెప్పవలసియుండును. ఆలాగున చెప్పడము యుక్తము కాదని రామవసిష్ఠసంవాదవాక్యముల చేత కనుపడుచున్నది.

రాములవారిచేఁ జేయఁబడిన ప్రశ్న.

శ్లో. భగవన్ భూతభవ్యేశ కశ్చిజ్జాతసమాధికః,
ప్రబుద్ధ ఇవ విశ్రాంతో వ్యవహారపరోఽపి సన్.
కశ్చిదేకాంతమాశ్రిత్య సమాధినియమే స్థితః,
తయోస్తు కతరశ్శ్రేయా నితి మే భగవన్వద.

తా. భూతభవిష్యద్వస్తువుల నన్నిటిని నియమించుచున్న భావముగల ఓస్వామీ! యీలోకములో నొకపురుషుఁడు తత్త్వజ్ఞానము గలవాఁడయి లోకవ్యవహారముల నాచరించుచు విశ్రాంతి కలవాఁడయి యుండును. మఱియొకఁడు ఏకాంతమునందుండి సమాధి నాచరించుచుండును. వీ రిరువురిలో నెవ్వఁడు శ్రేష్ఠుఁడుగా నుండును. ఈయర్థమును నాకు విశదముగాఁ జెప్పవలయును.

ఇందుకు వసిష్ఠమహాముని చెప్పిన ఉత్తరము.

శ్లో. ఇమం గుణసమాహార మనాత్మత్వేన పశ్యతః,
అంతశ్శీతలతా యాఽసౌ సమాధిరభిధీయతే.

తా. ఈదృశ్యమానమయిన దేహేంద్రియమనఃప్రాణాదిప్రపంచమును ఆత్మ కాదని తెలుసుకొనియుండు పురుషున

ను హృదయమునందు గలుగు నీశీతలత్వము అనఁగా; రాగద్వే షాదిశూన్యత్వము గలదో అదియె సమాధి యని చెప్పఁ బడును.

శ్లో. దృశ్యైర్న మమ సంబంధ ఇతి నిశ్చిత్య శీతలః,
కశ్చిత్సంవ్యవహారస్థః కశ్చిద్ధ్యానపరాయణః.

తా. దృశ్యవస్తువు లన్ని కల్పితము లైనందున వాటితో ఁటి సంబంధము నాకు లేదని తెలిసి అంతఃకరణమునందు రాగ ద్వేషాదిశూన్యత్వము కలవాఁడై యొకపురుషుఁడు లోకవ్యవ హారములను యథేచ్ఛముగా నాచరించుచుండును. మరియొకఁ డు సమాధినిరతుఁడయి యుండును.

శ్లో. ద్వావేతౌ రామ సుసమౌ అంతశ్చేత్పరిశీతలౌ,
అంతశ్శీతలతా యా స్యాత్తదనంతతపఃఫలం.

తా. వీరిద్దఱు నంతఃకరణమునందు శీతలత్వము కలవా రై యుండిరా, నిండుగ సమానులుగానే యుందురు. అంతశ్శీత లత్వ మనునది అనేకతపస్సులయొక్క ఫలము.

సమాధానము— ఇది దోషము కానేరదు. ఇచ్చట నుదా హరించిన రామవసిష్ఠసంవాదవాక్యములయందు వాసనాక్షయ రూపమైన యంతశ్శీతలత్వము నవశ్యముగా సంపాదింపవలయు నని ప్రతిపాదింపఁబడియున్నది గాని వాసనాక్షయానంతరము సంపాదింపఁదగిన మనోనాశము శ్రేష్ఠము కాదని చెప్పియుండ లేదు. శీతలత్వ మనఁగా తృష్ణాదివాసనానివృత్తి యని వసిష్ఠమ హర్షియే స్పష్టపఱచియున్నారు.

శ్లో. అంతశ్శీతలతాయాం తు లబ్ధాయాం శీతలం జగత్,
అంత స్తృష్ణోపతప్తానాం దావదాహమిదం జగత్.

తా. హృదయమునందు శీతలత్వము పుట్టినపక్షమున నీ జగత్తు శీతలమైయుండి హృదయములో హాయిని కలుగఁజేయును. తృష్ణ యనఁగా ఆశ. ఆయాశ చేత హృదయమునందు బాధింపఁబడువారికి దవాగ్నివలె నీజగత్తు విదాహమును పుట్టించును.

ఇందుచేత తృష్ణాదిదోషములు హృదయములో లేక యుండుటయే అంతశ్శీతలత్వ మని చెప్పఁబడుచున్నది.

ఆక్షేపము—ఓయీ యీరామవసిష్ఠసంవాదవాక్యముల యందే సమాధినిందయును, లోకవ్యవహారముయొక్క ప్రశంసయును కనుపడుచున్నది.

శ్లో. సమాధిస్థానకస్థస్య చేతశ్చేద్వృత్తిచంచలం,
తత్తస్య తు సమాధానం సమమున్మత్తతాండవైః.

తా. సమాధియందు చేరిన పురుషునియొక్క చిత్తము విషయాంతరములను గ్రహించువృత్తులచేత చపలమైయుండెనా, అట్టిపురుషునియొక్క సమాధి పిచ్చివాఁడు చేయు తాండవముతో సమానమై యుండును. అనఁగా నిష్ప్రయోజన మని భావము.

శ్లో. ఉన్మత్తతాండవస్థస్య చేతశ్చేత్క్షీణవాసనం,
తత్తస్యోన్మత్తనృత్యం తు సమం బ్రహ్మసమాధినా.

తా. పిచ్చివానినృత్యమువలె నిష్ప్రయోజన మయిన లోకవ్యవహారము ననుష్ఠించు పురుషుని యొక్క చిత్తము వాసనాక్షయము గలిగియుండెనా, ఆపురుషునియొక్క లోకవ్యవ

హారము బ్రహ్మసమాధితో సమానమై యుండును. ఈశ్లోకములయందులోకవ్యవహారము ప్రశంసింపఁబడుచున్నది. సమాధి నిందింపఁబడుచున్నది.

సమాధానము—ఇచ్చట సమాధియొక్క ప్రాశస్త్యము నంగీకరించి వాసన నిందింపఁబడుచున్నది. ఇచ్చట నుదాహరించినవసిష్ఠవాక్యముల కర్థ మీప్రకారము తెలియఁదగినది. విచారింపఁగా లోకవ్యవహారముకంటె సమాధియె శ్రేష్ఠము. అయినా, సమాధి వాసనాసహితమై యుండెనా, వాసనారహితమయినవ్యవహారమునకంటె నధమముగ చెప్పఁదగియుండును. సమాహితుఁడైనవాఁడును వ్యవహారమును చేయువాఁడును ఉభయులును తత్త్వజ్ఞానములేనివారై వాసనాసహితులై యుండిరో సమాధి ఉత్తమలోకప్రాప్తికారణమైనందున వ్యవహారమునకంటె సర్వాత్మనా శ్రేష్ఠమని చెప్పఁదగియున్నది.

సమాహితవ్యవహర్తలిద్దఱును తత్వజ్ఞులై నిర్వాసనులై యుండిరా, వాసనాక్షయరూపమయిన జీవన్ముక్తిని పరిపాలించుచున్నమనోనాశ మను సమాధి ప్రశస్తముగానే యుండును. కనుక యోగీశ్వరుఁడు సర్వవిధములచేత నధికుఁడై యున్నందున ప్రయోజనపంచకముగల జీవన్ముక్తికి విఘ్నలేశమైనా లేదనుట సిద్ధము.

ఇది జీవన్ముక్తిప్రకాశికయందు జీవన్ముక్తిఫలప్రకరణ
మను నాలుగవభాగము సమాప్తము.

శ్రీ హయగ్రీవాయ నమః.

# జీవన్ముక్తి ప్రకాశిక.

## ౫-వ ప్రకరణము.



హరిః ఓమ్.

ఇఁకను జీవన్ముక్తికి ఉపకారకమైన విద్వత్సన్న్యాసమును నిరూపించెదము.

విద్వత్సన్న్యాసము పరమహంసోపనిషత్తులో చెప్పఁబడినది ఆ ఉపనిషత్తును ఇచ్చట ననువదించి వ్యాఖ్యానమును చేసెదము. అందు విద్వత్సన్న్యాసయోగ్యమైన ప్రశ్నను ముందుగా చేసియున్నారు.

శ్రు. అథ యోగినాం పరమహంసానాం కోఽయం మార్గస్తేషాం కా స్థితిరితి నారదో భగవంతముపగత్యోవాచ.

తా. ఇచ్చట అథశబ్దమునకు ఆనంతర్య మర్థము కాదు. ప్రశ్నయే యర్థము. ని. 'మంగళానంతరారంభప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ' అని నిఘంటువునందు మంగళము, ఆనంతర్యము, ఆరంభము, ప్రశ్నము, సాకల్యము ఇవి అథశబ్దార్థము లని చెప్పఁబడి యున్నవి. కనుక విద్వత్సన్న్యాసమునుగూర్చి ప్రశ్న చేయఁబడుచున్నది. అథశబ్దార్థము బ్రహ్మతత్త్వజ్ఞానముగలిగి లోకవ్యవహారములచేత విక్షేపము నొందుచున్నచిత్తముగల

-వాఁడైయుండి మనోవిశ్రాంతి నపేక్షించుపురుషుఁడు విద్వత్స
న్యాసమం దధికారి. ఇట్టి అధికారము గలిగినతరువాత నని
యైనా అథశబ్దమున కర్థమును చెప్పవచ్చును. యోగులయిన
పరమహంసపరివ్రాజకులయొక్క మార్గము స్థితియు నెట్టివి యని
నారదమహర్షి భగవంతుఁడైన హిరణ్యగర్భునిసన్నిధికి పోయి
అడిగె నని శ్రుత్యర్థము.

ఇచ్చట కేవలయోగులనుగూర్చి కాని కేవలపరమ
హంసపరివ్రాజకులను గూర్చి కాని ప్రశ్న చేయఁబడినది కాదు.
ఇఁక నేమంటే యోగులై పరమహంస లగువారిని గూర్చి ప్రశ్న
చేయఁబడినది.

కేవలయోగులు తత్త్వజ్ఞానము లేనందున కాలత్రయ
జ్ఞానము ఆకాశగమనము మొదలైన యోగైశ్వర్యచమత్కా
రమం దాసక్తులై, ధారణా ధ్యాన సమాధులను అణిమాదిసిద్ధు
లకొరకే అనుష్ఠించుచుందురు. అందువలన పరమపురుషార్థమై
న మోక్షములోనుండి భ్రష్టు లగుదురు. ఈయర్థమునం దిదివర
కే పాతంజలసూత్రము నుదాహరించియున్నారము.

ఈసూత్రార్థ మిదివరకే వ్రాయఁబడియున్నది.

సూ. తే సమాధావుపసర్గావ్యుత్థానే సిద్ధయః. అని.

కేవలపరమహంసపరివ్రాజకులు బ్రహ్మాత్మత్వమును వివే
చించి తెలుసుకొనియున్నందున యోగైశ్వర్యములయం దపార
త్వమును కనిపెట్టి వాటియందు విరక్తులై యుందురు.

ఈయర్థమందును ప్రమాణమును మునుపే యుదాహ
రించి యున్నారము.

శ్లో॥ చిదాత్మన ఇమా ఇత్థం ప్రస్ఫురంతీహ శక్తయః,
ఇత్యస్యాశ్చర్యజాలేషు నాభ్యుదేతి కుతూహలం. అని.

ఈశ్లోకార్థము ను పూర్వమే వ్రాయఁబడియున్నది.

ఈపరమహంసలు యోగైశ్వర్యాదులలో విరక్తులైనప్పటికి బ్రహ్మజ్ఞానాతిశయముచేత విధినిషేధముల నుల్లఘించి సంచరించుదురు.

శ్లో॥ నిస్త్రైగుణ్యే పథి విహరతాం కో విధిః కో నిషేధః.
అనుశ్లోకమునం దీయర్థము చెప్పఁబడినది. ఇట్టి పురుషుని శాస్త్రాచారమందు శ్రద్ధగల శిష్టులీప్రకారముగా నిందించెదరు.

శ్లో॥ సర్వే బ్రహ్మ వదిష్యంతి సంప్రాప్తే తు కలౌ యుగే,
నానుతిష్ఠంతి మైత్రేయ శిశ్నోదరపరాయణాః.
అని విష్ణుపురాణములోని పరాశరవచనము.

తా॥ కలియుగము రాఁగానే ప్రపంచములోని జనులందఱు పరబ్రహ్మను చెప్పుచుండురుగాని జ్ఞానానురూపమయిన అనుష్ఠానము లేకయుందురు. స్త్రీసంభోగము, ఉదరపోషణము వీటియం దాసక్తులైయుందురు. యోగులైన పరమహంసపరివ్రాజకులయం దీదోషములు రెండు ఉండనేరవు.

ఈయోగియైన పరమహంసకు దోషద్వయము లేకపోవడమే కాక మరియొకవిశేషము కూడ కలదని శ్రీరామవసిష్ఠ సంవాదముచేత చూపింపఁబడినది.

శ్రీరాములవారిచే చేయఁబడిన ప్రశ్న.

శ్లో॥ ఏవం స్థితేఽపి భగవన్ జీవన్ముక్తస్య సన్మతేః,
అపూర్వోఽతిశయః కోఽసౌ భవత్యాత్మవిదాం వర.

తా. జీవన్ముక్తుఁడైన సత్పురుషులకు అపూర్వమైన అతిశయ మేమైనా కలుగునా, లేక తత్త్వజ్ఞానదశయం దున్నప్రకారముగానే యుండునా యని ప్రశ్నవాక్యార్థము.

ఇందుకు వసిష్ఠమహాముని చే చెప్పఁబడినయుత్తరము.

శ్లో. జ్ఞస్య కస్మింశ్చి దేవాంగ భవత్యతిశయేన ధీః,
నిత్యతృప్తః ప్రశాంతాత్మా స ఆత్మన్యేవ తిష్ఠతి.

తా. తత్త్వజ్ఞానికి ఆత్మాతిరిక్తమయిన యెట్టి విశేషమందైనా, బుద్ధి ప్రవర్తించ నేరదు. తత్త్వజ్ఞాని సర్వకాలములయం దత్యంతతృప్తి కలవాఁడై రాగద్వేషాదిశూన్యమయిన చిత్తముతో కూడుకొని పరమాత్మయందే నిష్ఠ కలవాఁడై యుండును.

శ్లో. మంత్రసిద్ధై స్తపస్సిద్ధై స్తంత్రసిద్ధైశ్చ భూరిశః,
కృతమాకాశయానాది తత్ర కా స్యాదపూర్వతా.

తా. మంత్రములను పునశ్చరణ చేసి సిద్ధి నొందినవారును తపస్సుల నారంభించి సిద్ధి నొందినవారును పాదలేపాద్యౌషధతంత్రములచేత సిద్ధినొందినవారును ఆకాశగమనాదివిచిత్రకార్యములను చేయుచున్నారు. అట్టికార్యములయందు అపూర్వత్వము అనఁగా నూతనత్వము లేదు. అనేకపురుషులచేత నాచరింపఁబడెడి యాకాశగమనాదివ్యాపారములు నూతనములు కావని తాత్పర్యము.

శ్లో. ఏక ఏవ విశేషోఽస్య న సమో మూఢబుద్ధిభిః,
సర్వత్రాస్థాపరిత్యాగాన్నీ రాగమమలం మనః.

తా. యోగియై తత్త్వజ్ఞానముగల జీవన్ముక్తునికి మూర్ఖులతో సమానముగాని విశేష మిది యొకటి యే కలదు. అది యేది యనఁగా బ్రహ్మలోకాంతైశ్వర్యములయందు అభిలాష లేనందున రాగము లేక నిర్మలమయిన మనస్సు కలిగి యుండుట.

శ్లో. ఏతావదేన ఖలు లింగమలింగమూర్తే
స్సంశాంతసంసృతిచిరభ్రమనిర్వృతస్య,
తజ్జస్య యన్మదనకోపవిషాదమోహ
లోభాపదామనుదినం నిపుణం తనుత్వం.

తా. పరతత్త్వజ్ఞానవిశిష్టుఁడయి చిరకాలానువృత్తమైన సంసారభ్రాంతి శమించినందున పరమసుఖియైన జీవన్ముక్తునికి కామక్రోధవిషాదమోహలోభాదిదోషము లన్నియు ప్రతిదినము క్షీణించిపోవుట యెఱుఁగుదును.

ఇట్టి యతిశయముతో కూడి వెనుక చెప్పిన రెండు దోషములు లేని మహాపురుషునియొక్క మార్గమును స్థితియును నారదమహామునిచే నడుగఁబడినవి.

వేషభాషాదిరూపవ్యవహారము మార్గ మని చిత్తశాంతిరూపమనోధర్మము స్థితి యని చెప్పఁబడును.

ఈ ప్రకారముగా నారదమహామునిచేఁ జేయఁబడిన ప్రశ్నమునకు భగవంతుఁడైన చతుర్ముఖబ్రహ్మ ప్రత్యుత్తరమును చెప్పుచున్నారు. అందులో ముందుగా తాము చెప్పఁబోవు మార్గమునందు శ్రద్ధాతిశయమును పుట్టించుటకుఁగాను మార్గమును స్తుతించుచున్నారు.

శ్రు. తం భగవానాహ సోఽయం పరమహంసానాం ముఖ్యో మార్గః. లోకే దుర్లభతరో న తు బాహుళ్యం.

తా. నారదునిఁగూర్చి చతుర్ముఖుఁడు చెప్పుచున్నాఁడు. ఈముందు చెప్పఁబోవునది పరమహంసలయొక్క ముఖ్యమార్గము.

ఇది లోకములో నిండు దుర్లభము. ప్రచురముగా లేదు.

ఈశ్రుతిలో 'సః' అనుశబ్దముచేత నేమార్గము అడుగఁబడెనో, అది పరామర్శింపఁబడినది. 'అయం' అను శబ్దముచేతను ముందు గ్రంథములో చెప్పఁబడు దండాచ్ఛాదనాదిరూపమయి స్వశరీరోపభోగముచేతను లోకోపకారముచేతను నిరపేక్షమయిన ముఖ్యమార్గము పరామర్శింపఁబడుచున్నది. పరమకాష్ఠను బొందిన యిట్టివైరాగ్యము లోకములో నెచ్చటను కనుపడనందున నీమార్గము దుర్లభ మని చెప్పఁబడినది. లోకములో నెచ్చటను కనుపడకపోయినమాత్రమున నీమార్గము అత్యంతాభావ మని శంకింపఁదగ దను నభిప్రాయముతో న తు బాహుళ్య మనుశబ్దముచేత నీమార్గము ప్రచురముగా లేదని చెప్పినది.

ఓయీ! యీమార్గము దుర్లభమయినపక్షమునకు దానివలన ప్రయోజనము లేనందున దానినిమిత్తమయి ఆయాసము చేయఁ దగదు అని శంకించుకొని చెప్పుచున్నారు.

శ్రు. యద్యేకోఽపి భవతి స ఏవ నిత్యపూతస్థః, స ఏవ వేదపురుష ఇతి విదుషో మన్యంతే.

తా. ఎవఁడైనా ఇట్టిపురుషుఁడు సంభవించెనా, ఆతఁడే నిత్యపూతసుఁడని వేదపురుషుఁడని పండితులు తలఁచెదరు. అనఁగా.

* శ్లో. మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే,
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః.

అనున్యాయప్రకారము ఏదేశమందైనా, యేకాలమందైనా యోగ్యమైన పరమహంస సంభవించినయెడల నాపురుషుఁడే నిత్యపూతస్థుఁడగును. నిత్యపూత మనఁగా పరబ్రహ్మ. పరబ్రహ్మస్వరూపుఁడగు నని తాత్పర్యము.

♦ శ్రు. 'అపహతపాప్మా విజరో విమృత్యుః.'

అనుశ్రుతి పరబ్రహ్మ సర్వపాపసంబంధము లేనిదని చెప్పుచున్నందున నిత్యపూతశబ్దము పరబ్రహ్మను బోధించుచున్నది. కేవలయోగి యగువాఁడు నిత్యపవిత్ర మయిన బ్రహ్మ నెఱుఁగఁజాలఁడు. కేవలజ్ఞానియగుపరమహంస బ్రహ్మను తెలిసినవాఁడైనప్పటికి చిత్తవిశ్రాంతి లేనందున బహిర్ముఖుఁడై బ్రహ్మస్వరూపమందు నిష్ఠగలవాఁడైయుండనేరఁడు గనుక నిచ్చట యోగియై

* ఈలోకములోఁగల యనేకలక్షలమనుష్యులలో నొకానొక మనుష్యుఁడు బ్రహ్మజ్ఞానసంపాదనేచ్ఛగలవాఁడై యత్నమును చేయుచుండును. యత్నించువార లనేకులలో నొకానొకఁడే పరమార్థతత్త్వమైన భగవంతుని యథార్థముగా నెఱుఁగును.

♦ ఆత్మయనఁగా సర్వదా నివృత్తమయిన పాపము కలవాఁడు; ముదిమి లేనివాఁడు; మరణము లేనివాఁడు.

న పరమహంసయే 'స ఏవ' అనుశబ్దముచేత చెప్పఁబడుచున్నాఁడు. ఇతఁడే వేదపురుషుఁడు వేదమందు ప్రతిపాదింపఁబడిన పురుషుఁడని అర్థము. శ్రు. 'బ్రహ్మవి దాప్నోతి పరం' ఇది మొదలయినశ్రుతులు బ్రహ్మ యని చెప్పినది యిట్టి యోగియైన పరమహంసయె యని తాత్పర్యము.

బ్రహ్మానుభవచిత్తవిశ్రాంతులను ప్రతిపాదించినశాస్త్రములను చక్కఁగా తెలిసినవారు విద్వాంసు లని చెప్పఁబడుదురు. అట్టి విద్వాంసులు యోగియైన పరమహంసను బ్రహ్మయనే చెప్పెదరు. ఇతరజనులు మాత్రము బ్రహ్మనిష్ఠుఁడని చెప్పెద రని పరమతాత్పర్యము.

విద్వాంసులు యోగియైన పరమహంసను బ్రహ్మగానే తలఁచెద రనెడియర్థము స్మృతివచనముచేత కూడ చెప్పఁబడుచున్నది.

శ్లో. దర్శనాదర్శనే హిత్వా స్వయం కేవలరూపతః,
యస్తిష్ఠతి స తు బ్రహ్మన్ బ్రహ్మ న బ్రహ్మవిత్స్వయం.

తా. ఏపురుషుఁడు జ్ఞానాజ్ఞానములను రెంటిని విడిచి కేవలస్వరూపముతోఁ బ్రకాశించుచుండునో ఆపురుషుఁడు సాక్షాత్పరబ్రహ్మమేకాని బ్రహ్మవేత్తయని చెప్పఁదగఁడని యర్థము.

కనుక యోగికి పరమహంసత్వము దుర్లభమయినందున ప్రయోజనము లేదని శంకింపఁదగదు.

శ్రు. మహాపురుషో యచ్చిత్తం తత్సర్వదా మయ్యేవావతిష్ఠతే. తస్మాదహం చ తస్మిన్నేవావస్థీయతే.

ఈవాక్యముచేత వెనుకఁజెప్పిన నిత్యపూతత్వస్థవేదపురుషత్వములను కంఠరవముగా వివరించుచు పరమహంసలయొక్క స్థితిని గురించి చేసిన ప్రశ్నమునకు ప్రత్యుత్తరమును చెప్పుచున్నారు.

వేదోక్తమయిన జ్ఞానకర్మల ననుష్ఠించువారిలో యోగియైన పరమహంస మిక్కిలి యుత్తముఁడయినందున మహాపురుషుఁడని చెప్పఁబడును. ఆమహాపురుషుఁడు సాంసారికవిషయములయందు వ్యాపించుచున్న చిత్తవృత్తుల నన్నిటిని నభ్యాసవైరాగ్యములచేతనిరోధించియున్నందున తనచిత్తము నెప్పటికి పరమేశ్వరుఁడనైననాయందే చేర్చియుండును. కనుక నేనును యోగియొక్క చిత్తమునందు సచ్చిదానందాద్వితీయపరబ్రహ్మస్వరూపములో నావిర్భవించి యుండును. అజ్ఞానులగు పురుషులు అవిద్యచేత నావరింపఁబడి యుందురుగనుక వారియందు నేను ఉండను. తత్వవేత్తలైనప్పటికి యోగులుకానివారు బాహ్యవిషయవ్యాపృతచిత్తవృత్తులు గలవారైనందునవారియందు కూడ ననావిర్భవించియుండను. ఇచ్చట నుపదేష్ట యగు చతుర్ముఖబ్రహ్మ ఉపాధ్యవచ్ఛిన్నచైతన్యస్వరూపుఁడయినప్పటికి, *సూ. శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్' అనున్యాయ ప్రకారము వేదాంతమహావాక్యజన్యప్రత్యగభిన్నబ్రహ్మసాక్షా

*కౌషీతకీబ్రాహ్మణములో నింద్రుఁడు పరమపురుషార్థాభిలాషియైన ప్రతర్దనుఁడనురాజును గూర్చి నన్ను ఉపాసించుమని చెప్పెను. అచ్చట ఇంద్రుఁడు నిరుపాధికచిద్రూపుఁడుకాఁడుగదా అతని నుపాసించుటచేత పరమపురుషార్థ మేలాగునఁ గలుగునని శంకింపఁగా తత్త్వమస్యాదివేదాంతవాక్యములం

త్కారము గలిగియున్నందున యోగిపరమహంసయొక్క చిత్తవృత్తిగోచరమైన పరబ్రహ్మను నేనే యని చెప్పినది విరుద్ధము కాదు.

శ్రు. అసౌ స్వపుత్రమిత్రకళత్రబంధ్వాదీన్ శిఖాయజ్ఞోపవీతే స్వాధ్యాయం చ సర్వకర్మాణి సన్న్యస్యాయం బ్రహ్మాండం చ హిత్వా కౌపీనం దండమాచ్ఛాదనం చ స్వశరీరోపభోగార్థాయ చ లోకస్యోపకారార్థాయ చ పరిగ్రహేత్.

తా. ఈవాక్యముచేత 'కోఽయం మార్గః' అను మార్గప్రశ్నమునకు సమాధానము చెప్పుచున్నారు.

గృహస్థాశ్రమిగానుండు నేపురుషుఁడు జన్మాంతరసంచితపుణ్యసముదాయము పరిపాకము నొందుటచేత వివిదిషాసన్న్యాసరూపమైన పరమహంసాశ్రమము సంగీకరించకయే తనతల్లిదండ్రులయొక్క వంశప్రభావమువలన వేదాంతశాస్త్రశ్రవణాదిసాధనముల ననుష్ఠించి పరమార్థతత్త్వమును చక్కగా తెలిసియుండునో; అనంతరము గృహస్థాశ్రమములో నున్నందువలన సంప్రాప్తములైన లౌకికవైదికవ్యవహారసహస్రములచేత చిత్తవిక్షేపము గలుగుచుండఁగా చిత్తవిశ్రాంతి సిద్ధించుకొరకు విద్వత్సన్న్యాసమును చేయ నిశ్చయించునో, అట్టిపురుషునిఁగూర్చి పుత్రులు

సోపాధికచేతనుఁడైన జీవుని నిరుపాధికచేతనుఁడైన పరబ్రహ్మకంటె అభిన్నునిగా చెప్పుచున్నందున నట్టి శాస్త్రార్థము ననుసరించి తన్నే పరబ్రహ్మనుగా నిండ్రుఁడిచ్చుట వామదేవునివలె నుపదేశించెను. వామదేవమహర్షి సర్వాత్మక బ్రహ్మసాక్షాత్కారము కలుగఁగానే, నేనే సూర్యుఁడను నేనే మనువును అని సర్వస్వరూపత్వమును తనయందే యనుసంధించె నని సూత్రముచేఁ జెప్పఁబడినది.

మిత్రులు భార్య బంధువులు మొదలైనవారి నందఱిని శిఖాయజ్ఞోపవీతములను వేదమును శ్రుతిస్మృత్యుక్త నైమిత్తికకర్మలను వీటి నన్నిటిని విడువవలయునని యుపదేశించుచున్నారు. పూర్వమందే వివిదిషాసన్న్యాసమును స్వీకరించి శ్రవణాదులచేత తత్త్వజ్ఞానము సంపాదించి విద్వత్సన్న్యాసమును గ్రహింపఁదలఁచినవానికి కళత్రపుత్రాదిసంబంధము అప్రసక్తమైనందున వానిని గూర్చి యీయుపదేశము చేయఁబడినదికాదు.

ఆక్షేపము—ఓయీ, ఈవిద్వత్సన్న్యాసమును కుటీచకాది సన్న్యాసములవలె ప్రైషోచ్చారణాదివిధ్యుక్తప్రకారముగా నాచరించవలయునా! లేక జీర్ణవస్త్రమును సోపద్రవగ్రామమును విడిచినట్టు యథేచ్ఛముగా విడువవచ్చునా? ఇందులో తత్త్వవేత్తఁగు గువాఁడు కర్తృత్వాదిధర్మశూన్యుఁడైనందున విధినిషేధశాస్త్రవశ్యుఁడు కాఁడుగనుక మొదటిపక్ష మంగీకరింపఁబడదు.

ఈయర్థ మొకస్మృతియందు చెప్పఁబడియున్నది.

శ్లో. జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః,
నైవాస్తి కించిత్కర్తవ్య మస్తి చేన్న స తత్త్వవిత్.

తా. అమృతమువలె నత్యంతభోగ్యమైన తత్త్వజ్ఞానముచేతనే తృప్తినొంది కృతకృత్యుఁడైన బ్రహ్మవేత్తకు చేయవలసియున్న కృత్యము కొంచెమైనా లేదు. ఉండెనా, అతఁడు బ్రహ్మవేత్తయే కాఁడని స్మృతివాక్యార్థము.

కౌపీనదండకాషాయాది సన్న్యాసధర్మముల నిచ్చుట విధించియున్నందున రెండవపక్షముకూడ అంగీకరింపఁదగదు. కనుక నీవిద్వత్సన్న్యాసము దురనుష్ఠేయముగా తోఁచుచున్నది.

సమాధానము—విద్వత్సన్న్యాసము ప్రతిపత్తికర్మవలె లౌకికవైదికరూపములు రెండును కలిగియున్నందున దురనుష్ఠేయము కాదు. అది యెటువలె నంటె వివరించెదము.

జ్యోతిష్టోమయాగమునందు దీక్షను బొందిన యజమానునకు దీక్షాంగములైన నియమములను అనుష్ఠించుకాలమునందు కండూయనార్థము హస్తము నిషేధింపఁబడి కృష్ణమృగవిషాణము (లేడికొమ్ము) విధింపఁబడినది. దీక్ష సమాప్తి నొందినతరువాతి కృష్ణమృగవిషాణముతోఁ బ్రయోజనము లేనందున నాకృష్ణమృగవిషాణముయొక్క పరిత్యాగము స్వయముగానే యేర్పడినది. ఇట్టి స్వతస్సిద్ధమయిన త్యాగమును, శ్రు. [1] 'నీతాసు దక్షిణాసు చాత్వాలే కృష్ణవిషాణం ప్రాస్యతి' అను శ్రుతి విధించుచున్నది. చాత్వాలదేశమందు కృష్ణమృగవిషాణత్యాగమనెడి యీకర్మ ప్రతిపత్తికర్మ యనఁబడును. ఇది వేదవిహితమైనందున వైదికముగాను స్వతఃప్రాప్తమయినందున లౌకికముగాను కూడ నున్నది. ఈప్రకారమే విద్వత్సన్న్యాసముకూడ శాస్త్రవిహితమయినందున శాస్త్రీయ మని స్వతః ప్రాప్తమయినందున లౌకికమని చెప్పఁబడియుభయరూపముగా నున్నది గనుక ప్రతిపత్తి సులభముగా ననుష్ఠింపఁ దగియున్నది.

---

1 యజమానునిచే నియ్యఁబడిన దక్షిణలను ఋత్విక్కులు గ్రహించిన తరువాత యజమానుడు తనచేత నున్న కృష్ణమృగశృంగమును చాత్వాలమను గుంటలో పడవేయవలసిన దని శ్రుత్యర్థము. చాత్వాల మనఁగా యజ్ఞపశువును హింసించిన చోటు.

ఇదిగాక చిదాత్మయందు దవిద్యచే నారోపింపఁబడిన కర్తృత్వము విద్యచేత నివర్తింపఁబడినప్పటికి చిదాభాససహితమయి యనేకసహస్రవికారములతో నెప్పటికిని గూడియున్న అంతఃకరణోపాధియందు స్వతస్సిద్ధమయియున్న కర్తృత్వము అంతఃకరణము ఉండువరకు నుండు స్వభావము గలది గనుక తత్త్వవేత్తలయందు కర్తృత్వము సుతరాం నివర్తించు నని శంకింపఁదగదు.

ఆక్షేపము.—ఓయీ యీప్రకారము తత్త్వవేత్తకు కర్తృత్వము కొంచెముగా నుండు నని చెప్పితే 'జ్ఞానామృతేన తృప్తస్య' అను స్మృతివచనము విరోధించును. ఆవచనమందు తత్త్వవేత్తకు కర్తృత్వాంశము కొంచెమైనను లేదని కదా చెప్పియున్నది.

సమాధానము—ప్రకృతవిద్వత్సన్న్యాసాధికారికి తత్వజ్ఞానము కలిగియున్నప్పటికిని చిత్తవిశ్రాంతి లేకపోవుటచేత తృప్తియుండదు గనుక చిత్తవిశ్రాంతిసంపాదనరూపకర్తవ్యాంశము కలిగి యున్నందున కృతకృత్యత్వము సంపూర్ణముగా లేదుగనుక నే విద్వత్సన్న్యాసాధికారికి కర్తవ్యము కొంచెముగాఁ గలదని చెప్పినది. 'జ్ఞానామృతేన తృప్తస్య' అనుస్మృతివచనము పంచమషష్ఠ సప్తమభూమికలయందున్న తత్వవేత్తల నుద్దేశించి ప్రవర్తించినది గాని విద్వత్సన్న్యాసాధికారిగానుండు చతుర్థభూమికానిష్ఠునివిషయమయి ప్రవర్తించినదికాదు గనుక విరోధము లేదు.

ఆక్షేపము.—ఓయీ తత్వవేత్తకు కూడ విధిబద్ధత కల దని చెప్పితే విధిజన్యమయిన అపూర్వమువలన జన్మాంతరము కూడ సంభవించును. అనఁగా శ్రు. 'అహరహస్సంధ్యాముపాసీత' యావజ్జీవ మగ్నిహోత్రం 'జుహోతి' ఇత్యాది విధివాక్యముల ననుసరించి చేయఁబడు సంధ్యావందనాగ్నిహోత్రాది కర్మలవలన నంభవించు పుణ్యమువలన జన్మాంతరము కలుగు నని భావము.

సమాధానము.—విధిననుసరించి తత్వవేత్తలచేత చేయఁబడు నిత్యనైమిత్తికకర్మలవలన నపూర్వము పుట్టును గాని ఆ యపూర్వమునకు జన్మాంతరము ఫలము కానేరదు. చిత్తవిశ్రాంతికి ప్రతిబంధము లైన పాపములను నివారించుటయే ఫలము. కర్మకుఁ గాని కర్మజన్యాపూర్వమునకుఁ గాని ప్రత్యక్షఫలము [సి]ద్ధించుచుండఁగా అప్రత్యక్షఫలమును కల్పింపఁదగదని న్యాయవేత్తలు చెప్పుచున్నారు గనుక నే 'వ్రీహీనవహన్యాత్' అను వాక్యమునందు అవహననమను (దంచుటయను) కర్మకు ప్రత్యక్షమయిన [తం]డుల సంపాదనమే (బియ్యమును జేయుటయే) ఫలము గాని [అ]గ్నిహోత్రాది కర్మలకు వలె అప్రత్యక్షమయిన స్వర్గాదులు [ఫ]లము కాదని చెప్పియున్నది. 'అగ్నిహోత్రాదితు తత్కార్యా[యై]వ తద్దర్శనాత్' అనుసూత్రమం దీయర్థము విస్పష్టముగా చెప్ప[బ]డియున్నది. తత్త్వవేత్తవలన ననుష్ఠించఁబడు అగ్నిహోత్రాది కర్మలు తత్త్వజ్ఞానము ఏఫలమును కలుగఁ జేయునో ఆఫలమును కలుగఁ జేయును గాని జన్మాంతర ప్రాప్తి మొదలైన ఫలాంతర[ము]లను కలుగఁ జేయవని సూత్రార్థము. కనుక స్నానాది విధి

జన్యమైన యపూర్వము జ్ఞానోత్పత్తిప్రతిబంధకములయిన పాప ములను నివారించి యేప్రకారము తత్వజ్ఞానమును కలుగఁజే యునో, జన్మాంతరమును గలుగఁజేయదో, యాప్రకారమే శిఖా యజ్ఞోపవీతత్యాగాదివిధిజన్యమైనయపూర్వముకూడ చిత్తవి శ్రాంతిప్రతిబంధములను నివారించి చిత్తవిశ్రాంతిని కలుగఁజే యును గాని జన్మాంతరమును గలుగఁజేయదు.

కనుక విధిని నంగీకరించినప్పటికి దోషము లేనందున తత్త్వజ్ఞానేచ్ఛవలన సన్యసించుగృహస్థునివలె తత్త్వజ్ఞానము గలిగి సన్యసించు గృహస్థపురుషుడును నాందీముఖశ్రాద్ధము ఉపవాసము జాగరణము మొదలయిన విధుల ననుసరించియే సన్యసించవలయును.

విచారించఁగా విద్వత్సన్యాసమును విధించిన శాస్త్రము నందు నాందీముఖశ్రాద్ధాది ధర్మములను విధించి యుండలేదు. అయినా, యీవిద్వత్సన్యాసము వివిదిషాసన్న్యాసముయొక్క వికృతి అయినందున వివిదిషాసన్న్యాసములోఁ జెప్పిన యావ ద్ధర్మములు విద్వత్సన్యాసమునందు "ప్రకృతివద్వికృతిర్ధర్తి ష్టవ్యా" అనున్యాయప్రకారము అతిదేశముచేత సంభవించును.

శ్రౌతకర్మలలో సర్వాంగములను ప్రతిపాదించి విధించిన కర్మలు ప్రకృతు లని, కొన్నిఅంగములను మాత్రము ప్రతిపాదిం చి విధించిన కర్మలు వికృతు లని చెప్పఁబడును. అందులో నేకర్మ యేకర్మయొక్క వికృతిగా నుండునో ఆ ప్రకృతికర్మయొక్క ధర్మము లన్నియు వికృతికర్మలో ననుష్ఠేయములుగా ప్రాప్తిం చును.

ఇందుకుదృష్టాంతము.—దర్శపూర్ణమాసములోని ఆగ్నేయయాగము ప్రకృతికర్మ. దీనియందు యావదంగములు విధింపఁబడియున్నవి. శ్రు. *'సౌర్యం చరుం నిర్వపేద్బ్రహ్మవర్చసకామః' అనుశ్రుతిచేత విధింపబడిన సౌర్యయాగము వికృతికర్మ. దీనియందు యావదంగములు విధింపఁబడియుండలేదు. ద్రవ్యదేవతాఫలములు మూడుమాత్రము విధింపఁబడియున్నవి. ఇచ్చట †సౌర్యయాగము ఆగ్నేయయాగమువలె నాచరింపఁదగియున్నది. ఈయర్థము సూ. 'అవిధేర్యజతేః పూర్వవత్త్వాం' అను జైమినిసూత్రముచేఁ జెప్పఁబడియున్నది.

కనుక వివిదిషాసన్న్యాసమునందువలె విద్వత్సన్న్యాసమునందు కూడ ప్రైషోచ్చారణపూర్వకముగా పుత్రమిత్రాదిత్యాగమును సంకల్పించవలయును. శ్రుతియందుఁగల బంధ్వాదిశబ్దములోని ఆదిశబ్దముచేత భృత్యులు పశువులు క్షేత్రములు గృహములు మొదలైన లౌకికవిషయములు చెప్పఁబడుచున్నవి. 'స్వాధ్యాయం చ' అను పదమందుఁగల చకారముచేత వేదార్థముల నిర్ణయించుటకు ఉపయుక్తములైన తర్కవ్యాకరణ మీమాంసాశాస్త్రములు వేదార్థోపబృంహణములగు నితి

* బ్రహ్మవర్చసమును కోరిన పురుషుఁడు సూర్యదేవతనుద్దేశించి చరుద్రవ్యముచేత యాగమును చేయవలయు నని శ్రుత్యర్థము.

† సౌర్యయాగములకు ప్రత్యేకముగా ననుష్ఠానక్రమమును బోధించనందున ప్రకృతికర్మయగు ఆగ్నేయయాగముయొక్క అనుష్ఠానక్రమమునే యంగీకరించవలయునని సూత్రార్థము.

హాసపురాణములును చెప్పఁబడుచున్నవి. లౌకికములైనపశుక్షేత్రాదులను వేదాధ్యయనమును తర్కవ్యాకరణమీమాంసాపురాణేతిహాసములను విడువవలయు నని తాత్పర్యము.

ఔత్సుక్యనివృత్తిఫలములుగా నున్న కావ్యనాటకాదులయొక్క త్యాగము కైముతికన్యాయసిద్ధము. అనఁగా శాస్త్రవిహితములైన వేదవ్యాకరణాదపాఠములనే త్యజింపవలసియుండఁగా *'కావ్యాలాపాంశ్చవర్జయేత్' అని నిషేధింపఁబడిన కావ్యనాటకాదిపాఠమును త్యజించవలయు నని చెప్పవలసినదే లేదని భావము.

'సర్వకర్మాణి' అనుపదమందుఁగల సర్వశబ్దముచేత లౌకికవైదికనిత్య నైమిత్తిక కామ్యనిషిద్ధకర్మలన్నియు సంగ్రహింపఁబడుచున్నవి. పుత్రాదిత్యాగముచేతనైహికభోగవాంఛయు, సర్వకర్మత్యాగముచేత ఆముష్మికభోగవాంఛయును పరిహరింపఁబడినది. ఈరెంఁడువాంఛలు చిత్తమునకు విక్షేపమును కలుగఁజేయును కనుక త్యాజ్యములుగానే ఉన్నవి. ఈబ్రహ్మాండమును త్యజింపవలయునని చెప్పినందున బ్రహ్మాండాధికారప్రాపకమైన విరాడుపాసనమును విడువవలయు నని చెప్పఁబడినది. 'బ్రహ్మాండం చ' యనుచకారముచేత సూత్రాత్మప్రాప్తికారణమైన హిరణ్యగర్భోపాసనమును తత్వజ్ఞానసాధనములైన శ్రవణాదులను గూడ విడువవలయునని చెప్పఁబడిన ఐహికాముష్మికములనన్నిటిని విడిచి కౌపీనమును దండమును కాషాయమును గ

*ఉద్యానక్రీడాద్యష్టాదశవర్ణనాత్మకములైన కావ్యములను పఠింపఁగూడదని స్మృతియొక్క తాత్పర్యము.

హింపవలయును. 'ఆచ్ఛాదనంచ' అనుపదమునం దున్న చకారము పాదుకలు మొదలయిన మఱికొన్నింటిని గ్రహింపవచ్చునని తెలియఁజేయుచున్నది.

శ్లో. కౌపీనయుగళం వాసః కంథాం శీతనివారిణీం,
పాదుకే చ నిగృహ్ణీయాత్కుర్యాన్నాన్యస్య సంగ్రహం.

అనుస్మృతి ఈయర్థమును వివరించుచున్నది.

తా. రెండు కౌపీనములను ఒక కాషాయవస్త్రమును చలి నివారించు నొక బొంతను పాదుకలను గ్రహింపవలయును. ఇంతకంటె నితరమైనవాటిని గ్రహింపఁగూడ దని స్మృతియొక్క యర్థము.

కౌపీనాదుల గ్రహించుటయును స్వశరీరోపభోగపరోపకారములకొరకేకాని ఆత్మజ్ఞానోపకారముకొఱకుఁగాదు. కౌపీనముచేత లజ్జను, దండముచేత సర్పాద్యుపద్రవమును ఆచ్ఛాదనముచేత చలిని, ఎండను, పాదుకలచేత నుచ్ఛిష్టదేశస్పర్శమును నివారించుకొనుటయే స్వశరీరోపభోగ మని దండకాషాయాదిచిహ్నములను జూచి తనయొక్క ఉత్తమాశ్రమమును నిశ్చయించుకొని తనకు నమస్కారభిక్షాప్రదానాదిసత్కారములను చేసి లోకులు సుకృతమును పొందుటయె పరోపకారమనియుఁ దెలియవలయును. ఇదిగాక, అనాదిశిష్టాచారప్రాప్తమయిన సన్న్యాసాశ్రమమర్యాదను పరిపాలించుటయు పరోపకార మని తెలియవలయును.

ఈవిద్వత్సన్న్యాసికి కౌపీనాదిపరిగ్రహము అనుకల్పమే కాని ముఖ్యము కాదని శ్రు. 'తచ్చ న ముఖ్యోసి' అని నిషేధించుచున్నది.

తా. కౌపీనదండాదులను పరిగ్రహింపవలయు నని వెనుక చెప్పినదియీపరమహంససన్న్యాసికి ముఖ్యము కాదు. అముఖ్యమే యని భావము.

వివిదిషాసన్న్యాసికి మాత్రము దండకాషాయాది గ్రహణము ముఖ్యము. కనుకనే వివిదిషాసన్న్యాసికి దండాదివియోగ మెప్పటికిని తగ దని నిషేధింపఁబడియున్నది.

శ్లో. దండాత్మనోస్తు సంయోగస్సర్వదైవ విధీయతే,
న దండేన వినా గచ్ఛేదిషుక్షేపత్రయం బుధః. అని.

తా. దండమునకును శరీరమునకును సంయోగముసన్న్యాసికి సర్వకాలములయందు కలిగియుండవలయును. దండమును విడిచి మూఁడుబాణములు పాఱెడి మార్గమునైనా నడువఁగూడదు.

'దండత్యాగే శతం చరేత్' అని దండము నశించితే నూఱుప్రాణాయామములను ఆచరించి ప్రాయశ్చిత్తమును చేసుకొనవలయునని కూడ చెప్పియున్నది. యోగియైనపరమహంసయొక్క ముఖ్యకల్పమును ప్రశ్నోత్తరములచేత శ్రుతి చూపుచున్నది.

శ్రు. కోఽయం ముఖ్య ఇతి చేదయం ముఖ్యః న దండం న శిఖా న యజ్ఞోపవీతం నాచ్ఛాదనం చరతి పరమహంసః. అని.

తా. యోగియైన పరమహంససన్న్యాసికి ముఖ్యకల్పమేది యనఁగా దండమునుగాని శిఖను గాని యజ్ఞోపవీత

మును గాని ఆచ్ఛాదనమును గాని ధరింపకయుండుటయే ముఖ్య కల్ప మని తెలియవలయు నని యర్థము.

వివిదిషాసన్న్యాసి శిఖాయజ్ఞోపవీతములను విడిచియుంటే యేప్రకారము ముఖ్యుఁడని చెప్పఁబడునో, ఆప్రకారమే యోగియైనపరమహంసన్న్యాసి దండాచ్ఛాదనములను విడిచి యుంటేనే ముఖ్యుఁడని చెప్పఁబడును. తత్త్వజ్ఞానియగువాఁడు చిత్తవిక్షేపమును నివారించుకొనుటకుఁగదా పరమహంసాశ్రమము నంగీకరించినది. అట్టిపరమహంసాశ్రమములో దండాచ్ఛాదనములను గ్రహింపవలసియుండెనా, దండమును వెదురు కఱ్ఱగా నుండవలయు నని ఆచ్ఛాదనము కంథగాను నుండవలయు నని పరీక్ష చేయుటయందు వీటిని సంపాదించుటయందు రక్షించుటయందును చిత్తము విక్షేపమును పొందును గనుక నిది యుక్తము కాదు. 'న హి వరఘాతాయ కన్యోద్వాహః' అని గదా లోకన్యాయము.

ఆచ్ఛాదనాదులు లేకపోతే, శీతవాతాదినివారణ మేలాగున కలుగునంటె చెప్పఁబడుచున్నది.

శ్రు. న శీతం న చోష్ణం న దుఃఖం న సుఖం న మానావమానే చ షడూర్మివర్జం. అని.

తా. ఏప్రకారము ఆటలయందాసక్తి కలిగియుండు బాలకులకుఆచ్ఛాదనములేకపోయినా, హేమంతశిశిరర్తువులయొక్క ప్రాతఃకాలములయందు కూడచలియుండదో, ఆప్రకారమే పరమాత్మయందాసక్తుఁడై నిరోధింపఁబడిన సమస్తచిత్తవృత్తులు గల యోగికి శీతోష్ణాదివిషయములు గోచరింపనందున శీతో

ష్ణసుఖదుఃఖమానావమానములు గలుగనేరవు. ఊర్మిషట్కము
ను కలుగనేరదు.

క్షుత్తు (ఆఁకలి), పిపాస (దాహము), శోకము, మో
హము,జర (ముదిమి), మరణము ఇవియాఱుఊర్మిషట్కమనఁబ
డును. ఈయాఱింటిలో క్షుత్పిపాసలు ప్రాణధర్మములు. శోకమో
హములు మనోధర్మములు. జరామృత్యువులు దేహధర్మములు
గనుక పరిశుద్ధాత్మస్వరూపనిష్ఠుఁడగు పరమహంససన్న్యాసికి
ఈమూఁడు ద్వంద్వములు కలుగ నేరవని నిశ్చయము.

సమాధియందు శీతోష్ణమానావమానములు లేకపో
యినా, వ్యుత్థానదశయందు వివేకము లేనివానివలె నీపర
మహంసను కూడ నిందాక్లేశము బాధించు నని శంకింపఁగా
శ్రుతి పరిహరించుచున్నది.

శ్రు. నిందాగర్వమత్సర దంభదర్పేచ్ఛాద్వేషసుఖదుఃఖకామక్రోధలోభ
మోహహర్షాసూయాఽహంకారాదీఁశ్చ.

తా. విరోధులయిన పురుషులు తనయందు దోషములు,
నారోపించి చెప్పుట నింద. అన్యులకంటె తాను అధికుఁడని తలఁ
చుట గర్వము, విద్యాధనాదులచే నధికులైనవారిని జూచి తాను
కూడ విద్యాధనాదులచేత వారితో సమానముగా నుండవలె
ననుబుద్ధి మత్సరము; ఇతరులు చూడవలయునని తనయొక్క
జపధ్యానాదికర్మల నితరులయెదుట నాచరించుట దంభము;
ఇతరులను తర్జన భర్త్సనలచేత తిరస్కరించుట దర్పము; ధన
క్షేత్రాదులయం దభిలాషయే ఇచ్ఛ; శత్రువధాదులయందు బు
ద్ధి ద్వేషము; అనుకూలములైన ద్రవ్యగృహక్షేత్రాదులయొక్క

లాభముచేత బుద్ధికి కలిగెడి స్వాస్థ్యము సుఖము. ప్రతికూలలాభముచేత బుద్ధికి కలిగెడి అస్వాస్థ్యము దుఃఖము; స్త్రీలు మొదలైనవాటియందు కలిగెడి ఇచ్ఛ కామము; ఆయిచ్ఛకు ప్రతిఘాతము కలుగుటచేత సంభవించు బుద్ధివిక్షోభము క్రోధము; ప్రాప్తమయినద్రవ్యముయొక్క త్యాగమును సహింపకపోవుట లోభము; హితులయందు అహితబుద్ధి అహితులయందు హితబుద్ధి గలిగియుండుట మోహము; మనస్సునందున్న సుఖమును ప్రకాశింపఁజేయు ముఖవికాసాదులకు కారణమైన బుద్ధివృత్తి హర్షము; అన్యులయొక్క గుణములయందు దోషము నారోపించుట అసూయ; దేహేంద్రియాదులయందు ఆత్మత్వభ్రాంతి అహంకారము; ఆదిశబ్దముచేత భోగ్యవస్తువులయందు మమకారము, సమీచీనత్వబుద్ధియును గ్రహింపఁబడును. చకారముచేత నీచెప్పఁబడిన నిందాదులకు విరుద్ధములయి యుండుస్తుత్యాదులు గ్రహింపఁబడుచున్నవి. ఈచెప్పిన నిందాదుల నన్నిటిని వెనుక చెప్పిన వాసనాక్షయాభ్యాసముచేత త్యజించియుండవలయు నని తాత్పర్యము.

స్వదేహము ధరింపఁబడియుండఁగా నిందాదిత్యాగమేలాగున సంభవించు నని శంకించి చెప్పుచున్నది.

శ్రు. స్వవపుః కుణపమివ దృశ్యతే యత స్తద్వపు రపధ్వ స్తం.

తా. తత్వజ్ఞానము కలుగక ముందు స్వకీయముగా తలఁపఁబడు శరీరము తత్త్వజ్ఞానము కలిగినతరువాతస్వాత్మచైతన్యముతో నేవిధమైన సంబంధము లేనిదై తోఁచుచున్నందున యోగికి శవమువలె కనుపడును. ఆచారశ్రద్ధ గలపురుషుఁ

డు స్పృశింపఁగూడ దనుభయముచేత శవదేహము నేప్రకార
ముగా దూరముగా నుండి చూచునో, యాప్రకారమే యోగి
యును తిరిగి తాదాత్మ్యభ్రాంతి పుట్టునేమో యను భయము
వలన సావధానుఁడై దేహమును చిదాత్మకంటె నత్యంతభిన్న
ముగా సర్వదా యాలోచించుచుండును. ఆచార్యోపదేశమువల
నను, శాస్త్రవచనములవలనను, స్వానుభవమువలనను నీశరీర
ము చిదాత్మకంటె నత్యంతభిన్నముగా బోధింపఁబడుచున్న దిగ
దా. కనుక చైతన్యముతో వియుక్తమయిన శరీరము శవముతో
సమానముగాఁ జూడఁబడుచున్నందున దేహము కలిగియున్నప్ప
టికి నిందాదిపరిత్యాగము సంభవించు నని యభిప్రాయము.

ఒకపురుషునికి కలిగిన దిగ్భ్రమ సూర్యోదయదర్శన
మువలన నివర్తించినప్పటికి ఒకానొకప్పుడు తిరిగి యేప్రకార
మనువర్తించునో ఆప్రకారమే చిదాత్మయందు నివర్తించిన
దేహతాదాత్మ్యము తిరిగి అనువర్తించినపక్షమందు నిందాది
క్లేశములు తిరిగితిరిగి ప్రసక్తములు కావా యని శంక రాఁగా
చెప్పఁబడుచున్నది.

శ్రు. సంశయ విపరీత మిథ్యాజ్ఞానానాం యో హేతుస్తేన నివృత్తిః. అని.

తా. చిదాత్మ కర్తృత్వాదిధర్మములు కలవాఁడా లేక
లేనివాఁడా యను జ్ఞానము సంశయము; దేహాదిరూపుఁడే య
నుజ్ఞానము విపరీతజ్ఞానము. ఈ రెండు భోక్తయందుఁ గలుగుచు
న్నవి. మిథ్యాజ్ఞానమని యిచ్చట చెప్పినది భోగ్యవస్తువులగు
దేహాదులయొక్క జ్ఞానమే కాని భోక్త యగు నాత్మయొక్క
జ్ఞానము కాదు. అట్టి భోగ్యవస్తువిషయమిథ్యాజ్ఞానము అనేక

ప్రకారములు గలదిగా నున్నది. అని శ్లో. 'సంకల్పప్రభవాన్ కామాన్' అను భగవద్గీతాశ్లోకమందు వివరింపఁబడినది. ఈమిథ్యాజ్ఞానము యొక్క కారణము నాలుగువిధము లని సూ. "అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యా" అని పాతంజలసూత్రములోఁ జెప్పఁబడినది.

అనిత్యములైన పర్వత నదీ సముద్రాదులయందు నిత్యము లనుబుద్ధి మొదటిది. అశుచియయిన (అపవిత్రమయిన) పుత్రభార్యాదిశరీరములయందు శుచిత్వబుద్ధి రెండవది. దుఃఖకరములయిన కృషివాణిజ్యాదివ్యాపారములయందు సుఖత్వబుద్ధి మూడవది. గౌణాత్మలయిన పుత్రభార్యాదులయందు మిథ్యాత్మ లగు స్థూలసూక్ష్మశరీరములయందును సుఖాత్మబుద్ధి నాలుగవది. ఇచ్చట చెప్పిన గౌణాత్మ మిథ్యాత్మ ముఖ్యాత్మలయొక్క స్వరూపము మాచేఁ జేయఁబడిన ఉపదేశసాహస్రియొక్క ప్రథమశ్లోకవ్యాఖ్యానములో విస్పష్టముగా చెప్పఁబడియున్నది గనుక నిచ్చట వివరింపఁబడదు. ఈచెప్పిన సంశయాదిజ్ఞానములకు అద్వితీయబ్రహ్మతత్త్వము నావరించియుండు అజ్ఞానము ఆయజ్ఞానజన్యమయినవాసనయును కారణములు. ఈ రెంటిలో నజ్ఞానము యోగియైనపరమహంసకు వేదాంతమహావాక్యార్థజ్ఞానమువలన నివర్తించినది. వాసన యోగాభ్యాసమువలన నివర్తించినది. వెనుక నుదాహరించిన దిగ్భ్రమయందు అజ్ఞానము నివర్తించినా వాసన నివర్తింపనందున పూర్వమువలె భ్రాంతివ్యవహారము కలిగియున్నది. ఇచ్చ

ట యోగియైనపరమహంసకువాసనగూడనివర్తించియున్నందున సంశయాదిజ్ఞానములు తిరిగివ్యవహరింపఁబడవు. సంశయాదిజ్ఞానములు సర్వప్రకారములవలన ననువర్తింప నేర వను నభిప్రాయమువలననే యిచ్చట యోగిని నిత్యనివృత్తుడని చెప్పినది. అజ్ఞానతద్వాసనలయొక్క నివృత్తి ఉత్పన్నమయినందున నేది పుట్టునో అది నశించు నను లోకన్యాయము ననుసరించి నశించునని యూహింపఁదగదు.* తార్కికమతమందు ప్రధ్వంసాభావము ఉత్పత్తి కలది అయినప్పటికి నే ప్రకారము నశింపదో ఆప్రకారమేయీ యజ్ఞానాదినివృత్తియునునశింపనేరదు. అజ్ఞానాదినివృత్తి నిత్యమైయుండు ననుటకు హేతువు చెప్పఁబడుచున్నది.

---

*తార్కికుల మతమందు ప్రాగభావమని, ప్రధ్వంసాభావ మని, అన్యోన్యాభావ మని, అత్యంతాభావ మని నాలుగు అభావపదార్థములు. ఘటముయొక్క ఉత్పత్తికి పూర్వమందు ఘటము లేకపోవుట ప్రాగభావమనఁబడును. ఇది అనాదిగానున్నప్పటికి ఘటము పుట్టఁగానే నశించును గనుక అనాది యని అనిత్యమని చెప్పఁబడును. నశించినతరువాత ఘటము లేకపోవుట ప్రధ్వంసాభావమనఁబడును. ఇది ఘటమందు పాషాణాదిపతనమువలనఁగలుగుచున్నందున ఉత్పత్తికలదైనప్పటికి పగిలి పోయినఘటము తిరిగి పుట్టనందున నీప్రధ్వంసాభావము నిత్యముగా నుండునుగాని నశింపదు, కనుక నేయేది పుట్టునో అదినిత్యము కాదను లోకన్యాయము ప్రధ్వంసాభావముకంటె నితరములైన పదార్థములను గూర్చి ప్రవర్తించినదని తార్కికుల కభిమానము. ఘటము పటమునందు, పటము ఘటమునందు లేకపోవుటయే అన్యోన్యాభావము. భూతభవిష్యద్వర్తమానకాలములలో లేకపోవుటయే అత్యంతాభావము. ఇది శశశృంగాదులయొక్క అభావము.

శ్రు. తన్నిత్యబోధః. అని.

ఇచ్చటితచ్ఛబ్దము సర్వనామశబ్దమైనందున సర్వవేదాంత ప్రసిద్ధమయిన పరమాత్మను చెప్పుచున్నది. ఆపరమాత్మయందు నిత్యమై అవిచ్ఛిన్నమైనజ్ఞానముగలయోగి * 'తన్నిత్యబోధః'అని చెప్పఁబడుచున్నాఁడు. యోగియైన పరమహంస 'తమేన ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః' అనుశ్రుతి ననుసరించి యోగాభ్యాసముచేత చిత్తవిక్షేపములనన్నిటిని నివర్తింపఁజేసుకొని నిరంతరముగా పరమాత్మవిషయమయిన జ్ఞానముగలవాఁడై యుండును. కనుక జ్ఞానము నిత్యముగా నున్నందునజ్ఞానముచేతఁ జేయఁబడిన యజ్ఞానతద్వాసనానివృత్తియును నిత్యముగానుండునని తాత్పర్యము.

ఇదిగాక వేదాంతిమతమందు 'భావాంతరమభావోఽన్యోనకశ్చి దనిరూపణాత్' అనున్యాయప్రకారము ఘటముయొక్క పూర్వావస్థయైన మృత్పిండము ప్రాగభావమని ఉత్తరావస్థయైనశకలములు ప్రధ్వంసాభావమని, చెప్పఁదగియున్నందున, అభావమనఁగా మఱియొక భావపదార్థమే కాని మరియొకటిగాదని యంగీకరించియున్నందున రజ్జువునందారోపింపఁబడిన సర్పముయొక్క నివృత్తి రజ్జుస్వరూపముగానేయున్నందున 'అధిష్ఠానావశేషో హి నాశః కల్పితవస్తునః' అనున్యాయమువలనను

---

* వేదాంతమహావాక్యశ్రవణమువలన నాపరమాత్మను చక్కగా తెలుసుకొని తరువాత నిదిధ్యాసనమును చేసి ప్రత్యక్షముగా తెలుసుకొనవలయునని శ్రుత్యర్థము.

బ్రహ్మయం దారోపింపఁబడిన అజ్ఞానవాసనాదులయొక్క నివృత్తి బ్రహ్మస్వరూపముగానే యున్నది గనుక అది నిత్యమని చెప్పినది నిండ యుక్తము.

అ— వేదాంతమహావాక్యజన్యజ్ఞానముచేతఁ దెలియఁబడుపరమాత్మ తార్కికులచేతఁ జెప్పఁబడిన యీశ్వరునివలెజీవుల కంటె భిన్నుఁడా యను శంకను నిరాకరించుచున్నది.

శ్రు. తత్స్వయమేవావస్థితః. అని.

తా. యోగియైన పరమహంస వేదాంతవేద్యమైన పరబ్రహ్మ యేది కలదో అది నేనే కాని నాకంటె భిన్నమైనది లేదని నిశ్చయించియుండును అని యర్థము.

అ— యోగియొక్క బ్రహ్మానుభవప్రకారము చూపఁబడుచున్నది.

శ్రు. తం శాంతమచలమద్వయానందఘన ఏవాస్మి తదేవ మమ పరంధామ. అని.

తా. 'తం, శాంతం, అచలం' అనుమూడుపదములయందు ద్వితీయావిభక్తిని ప్రథమావిభక్తిగా నన్వయించవలయును. కామక్రోధాదివిక్షేపము లేనిదై గమనాగమనాదిక్రియాశూన్యమై సజాతీయవిజాతీయస్వగతభేదరహితమై అఖండసచ్చిదానందరూపమయిన యేపరమాత్మ కలదో ఆపరమాత్మ నేనే. ఆపరమాత్మతత్త్వమే నాయొక్క వాస్తవస్వరూపము గాని కర్తృతాభోక్తృత్వాదివికారములుగల స్వరూపము గాదు. వికారకమైనస్వరూపము మాయాకల్పితము.

ఆక్షేపము—ఓయీ! జీవుఁడు పరమాత్మయే యని చెప్పితివి. ఆపక్షమందు జీవాత్మకు పరమానందప్రాప్తి ఇప్పు డేల లేకపోయెను?

సమాధానము—జీవాత్మకు పరమానందప్రాప్తి కలుగు లక్షణము పూర్వాచార్యులచే దృష్టాంతముతో కూడ చెప్పఁ బడినది.

శ్లో. గవాం సర్పిశ్శరీరస్థం న కరోత్యంగపోషణం,
తదేవ కర్మ రచితం పునస్తస్యైవ భేషజమ్.

తా. నెయ్యి గోవులయొక్క శరీరమందు సహజముగా నున్నప్పటికి వాటియొక్క శరీరమును పోషించుటకు నుపయోగింపదు. పాలను పితికి కాచి పెరుగుగాఁ జేసి మథించి వెన్నను తీసి కాచినపక్షమం దా నెయ్యియే దేహపోషణమునకు వైద్యమునకు వీటి కన్నిటికి నుపయోగించును.

శ్లో. ఏవం సర్వశరీరస్థ స్సర్పివత్పరమేశ్వరః,
వినా చోపాసనాం దేవో న కరోతి హితం నృప. అని.

తా. ఈప్రకారము నెయ్యివలె పరమేశ్వరుఁడు సర్వ శరీరములయం దున్నప్పటికి శ్రవణమనననిదిధ్యాసనములచేత ప్రత్యక్షముగా తెలియఁబడికాని మనుష్యులయందు పరమానం దప్రాప్తిని కలుగఁజేయఁ డని యర్థము.

ఇందుచేత జీవాత్మ సహజముగా పరమాత్మాభిన్నుఁ డయినప్పటికి పరమాత్మాభేదసాక్షాత్కారము కలిగిననే కాని

జీవాత్మకు పరమానందస్వరూపప్రాప్తి కలుగ నేరదని తెలియఁ దగినది.

అ. — యోగియొక్క పూర్వాశ్రమబంధువు. లయిన గురువు తండ్రి సోదరులు మొదలగువారు కర్మలయం దత్యంత శ్రద్ధగలవారై యుండి, శిఖాయజ్ఞోపవీతసంధ్యావంద నాదిరాహిత్యముచేత నితనియందు పాషండత్వము నారోపించి వ్యామోహమును పొందించుపక్షమం దావ్యామోహము నివర్తించుకొరకు యోగికి కలిగియుండు నిశ్చయమును చెప్పుచున్నది.

శ్రు. తదేవ చ శిఖా తదేవోపవీతం చ పరమాత్మాత్మనో రభేదజ్ఞానేన తయోర్భేద ఏవ విభగ్నః సా సంధ్యా. అని.

తా. ఈయోగికి వేదాంతవేద్యమయిన పరబ్రహ్మయొక్క తత్త్వజ్ఞానమే కలదో అదియె కర్మాంగములైన బాహ్యశిఖాయజ్ఞోపవీతములుగా నున్నది. కర్మాంగభూతములైన యాజ్యాపురోనువాక్యాదిమంత్రములును చరుపురోడాశాది ద్రవ్యములును బ్రహ్మతత్త్వజ్ఞానమే యని నిశ్చయము. విషయానందము లన్నియు బ్రహ్మానందాంతర్భూతములైనందున శిఖాయజ్ఞోపవీతాదిసాధ్యములైన కర్మలచేత కలుగు స్వర్గాదసుఖము లన్నియు బ్రహ్మజ్ఞానముచేతనే కలుగుచున్నవి అని తాత్పర్యము.

'ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతి' యనుశ్రుతి యిందుకు ప్రమాణము. ఈపరమానందస్వరూపుఁడయినపరమాత్మయొక్క స్వల్పాంశమును అవలంబించి దేవతిర్యఙ్మనుష్యాదిభూతములు సుఖము ననుభవించుచున్నవి యని శ్రుత్యర్థము.

ఇట్టియభిప్రాయముతోనే ఆథర్వణికులు బ్రహ్మోపనిషత్తులో చెప్పియున్నారు.

శ్రు. సశిఖం వపనం కృత్వా బహిస్సూత్రం త్యజేద్బుధః,
యదక్షరం పరం బ్రహ్మ తత్సూత్రమితి ధారయేత్.

తా. బ్రహ్మతత్త్వజ్ఞానముగల పురుషుఁడు శిఖతోఁగూడ క్షౌరమును జేసుకొని బాహ్యమున కనుపడుయజ్ఞోపవీతమును త్యజింపవలయును. వినాశము లేక నిత్యముగానుండు పరమాత్మనే బ్రహ్మసూత్రమునుగా ధరించవలయును.

శ్రు. సూచనాత్సూత్రమిత్యాహుస్సూత్రం నామ పరం పదం,
తత్సూత్రం విదితం యేన స విప్రో వేదపారగః.

తా. సమస్తార్థములను సూచించుటచేత సూత్రమని పెద్దలు చెప్పెదరు. అట్టి సమస్తార్థసూచకమయిన సూత్రము పరమాత్మస్వరూపమేగాని మఱియొకటి గాదు. అట్టిసూత్రమును ఏబ్రాహ్మణుఁ డెఱుఁగునో అతఁడు సమస్తవేదములయొక్క అంతమును ఎఱిఁగినవాఁడని చెప్పఁబడును.

శ్రు. యేన సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ,
తత్సూత్రం ధారయేద్యోగీ యోగవిత్తత్త్వదర్శివాన్.

తా. దారమందు మాణిక్యములవలె నెవనియందీ ప్రపంచము కూర్పఁబడియున్నదో ఆసూత్రమునే యోగియైనవాఁడు ధరించవలయును. అతఁడే యోగవేత్త యని తత్వవేత్త యని చెప్పఁదగినవాఁడు.

శ్రు. బహిస్సూత్రం త్యజేద్విద్వాన్ యోగముత్తమమాశ్రితః,
బ్రహ్మభావమిదం సూత్రం ధారయేద్యస్సచేతనః.
ధారణాత్తస్య సూత్రస్య నోచ్ఛిష్టో నాశుచిర్భవేత్.

తా. తత్వజ్ఞాని యగువాఁడు సర్వోత్తమమగు యోగము నాశ్రయించి బాహ్యముగా నుండు యజ్ఞోపవీతసూత్రమును త్యజించ వలయును. పరమాత్మస్వరూపమగు సూత్రమును ధరించినవాఁడే చేతనుఁడు. ఇట్టి బ్రహ్మసూత్రధారి యెప్పటికిని ఉచ్ఛిష్టదోషము గలవాఁడుగాని అపవిత్రుఁడుగాని కానేరఁడు.

శ్రు. సూత్రమంతర్గతం యేషాం జ్ఞానయజ్ఞోపవీతినాం,
తే వై సూత్రవిదో లోకే తేచ యజ్ఞోపవీతినః

తా. బ్రహ్మతత్వజ్ఞానమే యజ్ఞోపవీతముగాఁగల యోగులకు బ్రహ్మసూత్ర మంతర్గతమైయుండునో వారే లోకములో సూత్రము నెఱిఁగినవారనియు యజ్ఞోపవీతము వారనియు చెప్పఁబడుదురు.

శ్రు. జ్ఞానశిఖా జ్ఞాననిష్ఠా జ్ఞానయజ్ఞోపజీవినః,
జ్ఞానమేవ పరం తేషాం పవిత్రం జ్ఞానముచ్యతే.

తా. ఎవరికి జ్ఞానమే సర్వాధికముగా నుండునో, జ్ఞానమే శిఖగా కలవారుగా జ్ఞానమునందే, నిరంతరస్థితి గల

రుగా, జ్ఞానమే యజ్ఞోపవీతముగా గలవారుగా నుందురు. జ్ఞానము మహాపవిత్ర మని కదా చెప్పఁబడుచున్నది.

శ్రు. అగ్నేరివ శిఖా తస్య యస్య జ్ఞానమయీ శిఖా,
స శిఖీత్యుచ్యతే విద్వాన్ నేతరే కేశధారిణః.

తా. అగ్నికి తేజోమయమయిన శిఖవలె జ్ఞానమయమయిన శిఖ యెవనికి కలిగియుండునో, ఆతత్త్వజ్ఞానియే శిఖగలవాఁడుగా చెప్పఁబడునుగాని ఇతరులు వెంట్రుకలు కలవారే కాని శిఖకలవారు కారు.

శ్రు. కర్మణ్యధికృతా యే తు వైదికే బ్రాహ్మణాదయః,
తైర్విధార్యమిదం సూత్రం కర్మాంగం తద్ధి వై స్మృతం.

తా. బ్రాహ్మణులు మొదలగు నేజనులు వేదోక్తములైన నిత్యనైమిత్తికాదికర్మలయం దధికారము గలవారై యుందురో, వారే బాహ్యమైన యజ్ఞోపవీతసూత్రమును ధరించెదరు గాక. బాహ్యయజ్ఞసూత్రమే కదా కర్మలకన్నిటికి అంగముగా నుండు నని ధర్మశాస్త్రములయందు చెప్పఁబడినది.

శ్రు. శిఖా జ్ఞానమయీ యస్యోపవీతం చాపి తన్మయం,
బ్రాహ్మణ్యం సకలం తస్య ఇతి బ్రహ్మవిదో విదుః.

తా. ఎవనికి శిఖయును యజ్ఞోపవీతముగూడ జ్ఞానమయముగానే యుండునో వానియందే సకలవిధమయిన బ్రాహ్మణత్వము కల దని బ్రహ్మవేత్త లగువారు చెప్పెదరు.

శ్రు. ఇదం యజ్ఞోపవీతం చ పరమం యత్పరాయణం,
విద్వాన్ యజ్ఞోపవీతీ స్యాత్తజ్జ్ఞస్తం యజ్వినం విదుః.

తా. పరమగతిప్రాపకమయిన యేబ్రహ్మతత్త్వజ్ఞానము కలదో, అదియె యజ్ఞోపవీతము. కనుకనే బ్రహ్మజ్ఞానము గలవాఁడే యజ్ఞోపవీతము కలవాఁడని చెప్పఁబడును. ప్రాజ్ఞులగువారతనినే సకలయజ్ఞములు చేసినవాఁ డని చెప్పుదురు.

కనుక యోగికి శిఖాయజ్ఞోపవీతములు కలవు. ఆప్రకారమే సంధ్యయు కలదు. అహంప్రత్యయముచేత తెలియఁబడు జీవాత్మకు కేవలశాస్త్రముచేతనే తెలియఁబడు పరమాత్మకును భ్రాంతిచేత కలిగియున్నభేదము తత్త్వమస్యాదిమహావాక్యజన్యమైన అభేదజ్ఞానముచేత తిరిగి పుట్టకుండ నశించును. ఈయభేదజ్ఞానము జీవాత్మపరమాత్మలయొక్క సంధియందుఁ గలుగును గనుక సంధ్య యనఁబడును. అహోరాత్రములు రెంటియొక్క సంధియందుఁ గలుగుక్రియయే కదా సంధ్య యనఁబడునది. అహోరాత్రములయొక్క సంధియందుఁ గలిగినక్రియ సంధ్య యని చెప్పఁబడినట్లు జీవాత్మపరమాత్మలయొక్క సంధియందుఁగలిగిన అద్వైతజ్ఞానము సంధ్యయని చెప్పఁబడును. ఈప్రకారము పరమహంసకు కూడ శిఖాయజ్ఞోపవీతసంధ్యలు కలిగియున్నందున యోగి యగువాఁడు కర్మజడులచేత వ్యామోహమును పొందించుటకు శక్యుఁడు కాఁడు.

ఈప్రకారము పరమహంసయొక్కమార్గస్థితులను గూర్చి చేసిన ప్రశ్నలకు ప్రత్యుత్తరమును చెప్పి యిప్పుడు సమాప్తిచేయఁబడుచున్నది.

శ్రు. సర్వాన్ కామాన్ పరిత్యజ్య అద్వైతే పరమే స్థితిః.

తా. క్రోధలోభాదివృత్తులు కామజన్యము లయినం దున, కామమును విడువఁగానే క్రోధాదులు తమంతటనే విడువఁబడును.

ఈయభిప్రాయముతోనే బృహదారణ్యములో చెప్పఁబడినది.

శ్రు. అథో ఖల్వాహుః కామమయ ఏవాయం పురుషః.

కనుక యోగియొక్క చిత్తము కామాదిసర్వదోషములను విడిచి యుండును గనుక అద్వైతజ్ఞానమందు నిర్విఘ్నముగా స్థితిని బొందును.

అ॰ దండధారణవిధి ననుసరించి సద్వాసనావాసితులైనవివిదిషాసన్న్యాసులు దండశూన్యుఁడైన పరమహంసయోగిని అంగీకరించరుగదా యను శంక నివారింపఁబడుచున్నది.

శ్రు. జ్ఞానదండో ధృతో యేన ఏకదండీస ఉచ్యతే,
కాష్ఠదండో ధృతో యేన సర్వాశీ జ్ఞానవర్జితః.
స యాతి నరకాన్ ఘోరాన్ మహారౌరవసంజ్ఞి కాన్,
తితిక్షాజ్ఞానవైరాగ్యశమాదిగుణవర్జితః.
భిక్షామాత్రేణ యో జీవేత్స పాపీ యతివృత్తిహా,
ఇదమంతరం జ్ఞాత్వా స పరమహంసః. అని.

అర్థము.—ఎవనిచేత జ్ఞానదండము ధరించఁబడెనో, అతఁడు ఏకదండియని చెప్పఁబడును. జ్ఞానహీనుఁడై నియతిలేకుండ సర్వత్ర భుజించుచు కాష్ఠదండము నెవఁడు ధరించునో వాఁడు మహారౌరవము లని ప్రసిద్ధములయి భయంకరములైన

నరకములను పొందును. శీతోష్ణాదిద్వంద్వసహనము, జ్ఞానము, వైరాగ్యము, ఇంద్రియనిగ్రహము మొదలైన గుణములు లేక యే దండకాషాయాదులను గ్రహించి భిక్షామాత్రముచేత నెవఁడు జీవించుచుండునో అతఁడు సన్న్యాసులయాచారమును బాధించియున్నందున మహాపాపి యని చెప్పఁబడును. ఈతారతమ్యమును తెలుసుకొన్నవాఁడే పరమహంస యని చెప్పఁబడును. అని సామాన్యముగా శబ్దార్థము.

ఇఁక తాత్పర్యమును చెప్పెదము.

తా. త్రిదండసన్న్యాసికి వాగ్దండము, మనోదండము, కాయదండ మని మూఁడుదండము లేప్రకారముగాఁ గలవో ఆప్రకారమే పరమహంససన్న్యాసికి జ్ఞానదండ మని కాష్ఠదండ మని రెండుదండములు గలవు. వాగ్దండము మొదలగు మూఁడుదండములు మనువుచేతఁ జెప్పఁబడియున్నవి.

శ్లో. వాగ్దండోఽథ మనోదండః కర్మదండ స్తథైవచ,
యస్యైతే నియతా బుద్ధౌ స త్రిదండీతి చోచ్యతే.
త్రిదండమేతన్నిక్షిప్య సర్వభూతేషు మానవః,
కామక్రోధౌ తు సంయమ్య తతస్సిద్ధిం నిగచ్ఛతి.

తా. వాగ్దండ మనోదండ కర్మదండము లను మూఁడ దండములు ఎవనికి బుద్ధియందు నిరుద్ధములై యున్నవో, అతఁడు త్రిదండి యని చెప్పఁబడును. సకలభూతములయందు నీమూఁడుదండములను ప్రవర్తింపకుండ నిరోధించి తరువాత ముక్తిఁ బొందును.

వాగ్దండము మొదలగు నీమూఁడుదండములేవి యనఁగా దక్షస్మృతియందు చెప్పఁబడియున్నది.

శ్లో. వాగ్దండోఽథ మనోదండః కర్మదండ స్తథైవచ,
యస్యైతే నియతా దండాః త్రిదండీతి స ఉచ్యతే.

ఈశ్లోకార్థము పూర్వశ్లోకార్థము ఒక్కటే యైనందున తిరిగి చెప్పఁబడలేదు.

శ్లో. వాగ్దండే మౌనమాతిష్ఠేత్కర్మదండే త్వనీహతాం,
మానసస్య తు దండస్య ప్రాణాయామో విధీయతే.

తా. వాగ్దండమందు మౌనము నవలంబించవలయును. కర్మదండమందు విషయాంతరేచ్ఛను నివారింపవలయును. మానసదండమందు ప్రాణాయామమును చేయవలయును. మౌనాది త్రయము వాగ్దండాదిత్రయమునకు లక్షణ మని తాత్పర్యము. 'కర్మదండోఽల్పభోజనం' అని మరియొకస్మృతిలో చెప్పఁబడినది. అనఁగా మితముగా భుజంచుటయే కర్మదండమనిఅర్థము.

ఇటువంటిత్రిదండిత్వము పరమహంససన్న్యాసికి గూడ కలదు. ఈయభిప్రాయముతోనే పితామహస్మృతియందు చెప్పఁబడినది.

శ్లో. యతిః పరమహంసస్తు తుర్యాఖ్యః శ్రుతిచోదితః,
యమైశ్చ నియమైర్యుక్తో విష్ణురూపీ త్రిదండభృత్.

తా. పరమహంససన్న్యాసి యనువాఁడు తురీయుఁడని చెప్పఁబడును. ఇతఁడే వేదములయందుచెప్పఁబడియున్నాఁడు. ఇతఁడు యమనియమములతో కూడుకొని త్రిదండమును ధరించిన సాక్షాద్విష్ణుస్వరూపుఁడుగా నుండును.

తా. మౌనాదిత్రయ మేప్రకారమువాగాదినిగ్రహాకారణామైనందునదండమని చెప్పఁబడెనో, ఆప్రకార మేజ్ఞానముకూడ అజ్ఞానతత్కార్యనిరాకరణకారణమైనందున దండమనఁబడును. మానసిక మైనజ్ఞానదండము చిత్తవిక్షేపముచేత నొకానొక సమయములో విస్మృతమౌనేమో యని జ్ఞానదండమును ధరించవలయునను విధిశాస్త్రమున కిదియె తాత్పర్యము. ఇట్టితాత్పర్యమును తెలియక సన్న్యాసివేషమును గ్రహించినమాత్రమున పురుషార్థము సిద్ధించునని తలఁచి కాష్ఠదండము నెవ్వఁడు ధరించునో యాపురుషుఁడు బహుప్రకారసంతాపము కలవాఁడై యుండును గనుక భయంకరమైనమహారౌరవాదినరకములను బొందును. అందుకు కారణ మేమనఁగా చెప్పెదము. దండకాషాయాదులతోఁ గూడిన తనయొక్క పరమహంసవేషమునుజూచి, ఇతఁడు తత్త్వజ్ఞానముగలవాఁడుగానుండునని యూహించి సకలజనులు తమతమగృహములయందు భోజనమును చేయింతురు. ఈసన్న్యాసియును తాను జిహ్వాచాపల్యము కలవాఁడై గ్రాహ్యాగ్రాహ్యాన్నమును విభజించి తెలుసుకొనకయె సర్వాన్నమును భక్షించును. అందుచేత నజ్ఞాని యగు నీసన్న్యాసి పాపమునుబొందును. 'నాన్నదోషేణ మస్కరీ' 'చాతుర్వర్ణ్యం చరేద్భైక్షం' అని సన్న్యాసియగువాఁడు అన్నదోషముచేత లిప్తుఁడు కాఁడని బ్రహ్మక్షత్రవైశ్యశూద్రకులములు నాలుగింటియందును సన్న్యాసి భిక్షచేయవచ్చునని చెప్పినస్మృతివాక్యములు తత్త్వజ్ఞాని నుద్దేశించి ప్రవర్తించినవి గాని అజ్ఞాని విషయముగా ప్రవర్తించినవి కావు. కేవలసన్న్యాసి జ్ఞానవిహీ

నుఁడైనందున సర్వాన్నభక్షణముచేత నరకమును బొందుట యుక్తముగానే యున్నది.

కనుకనే జ్ఞానహీనుఁడైన సన్న్యాసికి భిక్షానియమము మనుస్మృతియందు చెప్పఁబడియున్నది.

శ్లో. న చోత్పాతనిమిత్తాభ్యాం న నక్షత్రాంగవిద్యయా,
నానుశాసనవాదాభ్యాం భిక్షాం లిప్సేత కర్హిచిత్.
ఏకకాలం చరేద్భైక్షం న ప్రసజ్జేత విస్తరే,
భైక్ష్యే ప్రసక్తో హి యతి ర్విషయేష్వపి సజ్జతి.

తా. కేవలసన్న్యాసియగువాఁడు ఉత్పాతములనుగాని శకునములనుగాని జ్యోతిషములనుగాని జనులకు చెప్పి భిక్షను పొందఁగూడదు. హితోపదేశమును చేసి గాని శాస్త్రవాదములను చేసి తనపాండిత్యమును ప్రకటనచేసి గాని భిక్షను పొందఁదలఁపఁగూడదు. ప్రతిదినమందు నొకపర్యాయము మాత్రము భిక్షను చేయవలయునే కాని రెండుమూడుపర్యాయములు చేయఁగూడదు. విస్తారముగా భిక్షయందాసక్తిగల సన్న్యాసి విషయములయందుఁ గూడ నాసక్తికలవాఁడై చెడిపోవును.

శ్రవణాదులచేత తత్త్వజ్ఞానము నభ్యసించు సన్న్యాసికి భిక్షాక్రమము మరియొకప్రకారముగా చెప్పఁబడియున్నది.

శ్లో. ఏకవారం ద్వివారం వా భుంజీత పరహంసకః,
యేన కేన ప్రకారేణ జ్ఞానాభ్యాసో భవేత్సదా.

తా. ఒకపర్యాయము గాని రెండుపర్యాయములు గాని పరమహంససన్న్యాసి భిక్షను చేయవచ్చును. తత్త్వజ్ఞాన

ధ్యానము నిర్విఘ్నముగా నేప్రకారము సిద్ధించునో, యాప్రకారముగాఁ జేయవలసినది.

కనుక జ్ఞానదండ కాష్ఠదండములలో జ్ఞానదండము ముఖ్య మని కాష్ఠదండ మధమ మనివిచారించి ఉత్తమమయిన జ్ఞానదండమును ఎవఁడు ధరించునో అతఁడు ముఖ్యమయిన పరమహంససన్న్యాసి యని అంగీకరించవలయును.

తత్త్వజ్ఞుఁడైనపరమహంససన్న్యాసికి జ్ఞానదండమే ముఖ్యము. కాష్ఠదండమును ధరింపవలయుననెడి నిర్బంధము లేదుగాని ఇతరమయినచర్య యెటువంటిదిగా నుండు నని శంకింపఁగా చెప్పఁబడుచున్నది.

శ్రు. ఆశాంబరో నిర్నమస్కారో నస్వధాకారో ననిందాస్తుతిర్యాదృచ్ఛికో భవేద్భిక్షుర్నావాహనం న విసర్జనం న మంత్రం న ధ్యానం నోపాసనం న లక్ష్యం నాలక్ష్యం న పృథక్ నాపృథక్ న చాహం న చ త్వం న సర్వం చానికేతస్థితిరేవ స భిక్షుస్సౌవర్ణాదీనాం నైవ పరిగ్రహేత్తల్లోకం నావలోకయేచ్చ. అని.

తా. దిక్కులే అంబరముగా (వస్త్రముగా) గలవాఁడై యుండవలయును.

శ్లో. జాన్వోరూర్ధ్వమధో నాభేః పరిధాయైకమంబరం,
ద్వితీయముత్తరం వాసః పరిధాయ గృహానటేత్.

తా. మోఁకాళ్లకు పైభాగమును నాభికి క్రిందిభాగమును ఒకవస్త్రముచేత నాచ్ఛాదించుకొని మరియొకవస్త్రమును కప్పుకొని భిక్షార్థముగా గృహములను గూర్చి తిరుగుచుండవలయును.

ఈప్రకారము సన్న్యాసికి వస్త్రధారణమును విధించిన స్మృతివచనము బ్రహ్మజ్ఞానహీనుఁడైన కేవలసన్న్యాసినిగూర్చి ప్రవర్తించినది. కనుకనే కాషాయధారణాదిధర్మములు పరమహంససన్న్యాసికి ముఖ్యములు కావని చెప్పినది.

శ్లో. యో భవేత్పూర్వసన్న్యాసీ తుల్యో వై ధర్మతో యది,
తస్మైప్రణామః కర్తవ్యో నేతరాయ కదాచన.

ఈశ్లోకార్థము పూర్వమునందే వ్రాయఁబడియున్నది.

అని తనకంటె అధికచాతుర్మాస్యలు కలిగి తనతో సమానముగా శ్రవణాదుల నాచరించుసన్న్యాసికి తాను నమస్కరించవలయునని చెప్పిన యీస్మృతివచనమును యోగికాని సన్న్యాసివిషయమయినందున యోగియైన పరమహంసస న్న్యాసి మరియొకరికి నమస్కరించవలసినది లేదు. కనుకనే బ్రాహ్మణశబ్దముచేత జీవన్ముక్తుని నిర్దేశించి తల్లక్షణములను చెప్పునప్పుడు 'నిర్నమస్కారమస్తుతిమ్'అని ఉదాహరించినారము.

ఇట్టిపరమహంససన్న్యాసి శ్రద్ధామాంద్యముచేత గయాప్రయాగాదిపుణ్యతీర్థములకు పోయినా, అచ్చట పితృదేవతల నుద్దేశించి *స్వధాకారము నుచ్చరింపఁగూడదు. ఇదిగాక,నిందాస్తుతులు లేనివాఁడై యుండవలయును. ఇంతకు ముందు చెప్పియున్న నిందాగర్వేత్యాదివాక్యములో అన్యజనులు తనవిషయమైచేసిననిందచేత తాను క్లేశమును పొందఁగూడదని చెప్పఁ

---

* పితృదేవతల నుద్దేశించి శ్రాద్ధమును చేయునప్పుడు ఉచ్చరింపఁబడు ముఖ్యమంత్రము స్వధా యనఁబడును.

బడినది. ఇచ్చట అన్యజనులను గూర్చి తాను నిందాస్తుతులను చేయఁగూడ దని నిషేధింపఁబడుచున్నది. కనుక పునరుక్తదోషము లేదు. ఇదిగాక వైదికవ్యవహారమందుఁగాని లౌకికవ్యవహారమందుఁగాని యాదృచ్ఛికముగా నుండవలయును గాని నిర్బంధము కలవాఁడై యుండఁగూడ దని భావము.

ఈకార్య మవశ్యముగా చేయవలయునను అభినివేశము నిర్బంధమనఁబడును.

శ్లో. * భిక్షాటనం తపశ్శౌచం స్నానం ధ్యానం సురార్చనం,
కర్తవ్యాని షడేతాని సర్వథా నృపదండవత్.

ఈశ్లోకమందు చెప్పిన దేవపూజ యోగిసన్యాసివిషయమే కాని జ్ఞానసన్న్యాసివిషయముకా దను అభిప్రాయముతో ఆవాహనవిసర్జనమంత్రములు ♦ధ్యానోపాసనములును నిషేధింపఁబడినవి. యోగి యగు నీపరమహంసకు స్తుతినిందాదిలౌకికవ్యాపారములును దేవపూజాదివైదికవ్యాపారము లేప్రకారము లేవో, ఆప్రకారమే లక్ష్యత్వాదిజ్ఞానశాస్త్రవ్యవహారములు కూడ లేవని నిషేధింపఁబడుచున్నది. ప్రమాణ ప్రమేయ

---

* భిక్షార్థము సంచరించుటను కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సులను మృజ్జలాదులచేతఁ జేయఁబడు కాయశుద్ధిని స్నానమును బ్రహ్మధ్యానమును దేవతాపూజను వీనినాఱింటిని సన్న్యాసియగువాఁడు రాజాజ్ఞవలె తప్పక చేయవలయునని శ్లోకార్థము.

♦ ధ్యాన మనఁగా సకృదనుసంధానము. ఉపాసనమనఁగా నిరంతరానుసంధానము.

ప్రమాతలను ప్రకాశింపఁజేయుసాక్షిచైతన్యము తత్త్వమసి యను మహావాక్యములోనిత్వంపదమునకు లక్ష్యార్థమైయున్నది. దేహేంద్రియాదివిశిష్టమైన చైతన్యము త్వంపదమునకు వాచ్యమే కాని లక్ష్యము గాదు. అట్టివాచ్యము తత్పదార్థముకంటె భిన్నము. లక్ష్యము అభిన్నము. స్వదేహనిష్ఠమయిన త్వంపదవాచ్యార్థము అహం (నేను) అని చెప్పఁబడును. పరదేహనిష్ఠమైన త్వంపదవాచ్యార్థము త్వం (నీవు) అని చెప్పఁబడును. లక్ష్యమని వాచ్యమని చెప్పఁబడు ఉభయవిధచైతన్యశూన్యమై జడమైన ప్రపంచముసర్వమని చెప్పఁబడును. ఇట్టి లక్ష్యాలక్ష్యాదిజ్ఞానశాస్త్రవ్యవహారములలో నొకటికూడ బ్రహ్మయందు విశ్రాంతమైనచిత్తముగలయోగికి సంభవింపనేరదు. కనుక నే యాపరమహంస గృహమందు నివసించువాఁడు కాఁడు. నియతముగా నివసించుట కొరకొక మఠమును కల్పించుకొని యుండెనా, యామఠమందు, మమకారము గలిగి దానియొక్క హానివృద్ధులచేత చిత్తము విక్షేపము నొందుచుండును.

ఈయభిప్రాయముతోనే శ్రీగౌడపాదాచార్యులవారు చెప్పియున్నారు.

శ్లో. నిఃస్తుతిర్నిర్నమస్కారో నిస్స్వధాకార ఏవ చ,
చలాచలనికేతశ్చ యతిర్యాదృచ్ఛికో భవేత్.

తా. పరమహంసపరివ్రాజకుఁడు స్తుతి నమస్కార స్వధాకారములు లేనివాఁడుగాను, నియతనివాసము లేనివాఁడుగాను, యాదృచ్ఛికవృత్తిగలవాఁడుగాను నుండవలయు నని భావము.

మఠము ఏప్రకారము పరిగ్రహింపఁదగదో, ఆప్రకా రమే సువర్ణరజతకాంస్యతామ్రాదిపాత్రలను భిక్షాచమనా దులయం దుపయోగపఱచుకొనఁదగదు.

ఈయర్థము స్మృతిలో చెప్పఁబడియున్నది.

శ్లో. హిరణ్మయాని పాత్రాణి కార్ష్ణాయసమయాని చ,
యతీనాం నాన్నపాత్రాణి వర్జయేత్తాని భిక్షుకః.

తా. సువర్ణపాత్రలు, ఇనుము, ఉక్కు మొదలయిన పాత్రలు సన్న్యాసులకు భోజనపాత్రలుగా నుండఁగూడదు.

సువర్ణాదిపాత్రలను సన్న్యాసి వర్జించవలయును అని మనుస్మృతియందు కూడ చెప్పఁబడియున్నది.

శ్లో. అతైజసాని పాత్రాణి యతీనాం నిర్వ్రణాని చ,
తేషాం మృద్భిః స్మృతం శౌచం చమసానామివాధ్వరే.
అలాబుదారుపాత్రం వా మృణ్మయం వైణవం తథా,
ఏతాని యతిపాత్రాణి మనుస్స్వాయంభవోఽబ్రవీత్.

తా. సువర్ణాదిలోహములతోఁ జేయఁబడినవియు బుడ ఫులు లేనివియు అయినపాత్రములను సన్న్యాసులు గ్రహింపవ యును. ఇట్టిపాత్రలకు యాగమందు చమసము లనుసోమపాత్ర లకు ఉచ్ఛిష్టాదిస్పర్శయందు జలమువలననే శుద్ధి కలుగునటు కేవలజలముచేతనే శుద్ధి కలుగును. కనుకనే సొరకాయబుర్ర నైనా, కొయ్యతోఁ జేయఁబడిన పాత్రమునైనా వెదురుగొట్ట మునైనా సన్న్యాసి గ్రహించవలయునని స్వాయంభువమనువుచే జెప్పఁబడినది.

బోధాయనమహర్షియు నీప్రకారముగానే చెప్పియున్నారు.

శ్లో. స్వయమాహృతపర్ణేషు స్వయంశీర్ణేషు వా పునః,
భుంజీత న వటాశ్వత్థకరంజానాం చ పర్ణకే.

తా. స్వయముగా తెచ్చుకొన్న పత్రములయందుఁగాని స్వయముగా క్రిందరాలినపత్రములయందుఁగాని సన్న్యాసి భోజనమును చేయవలసినది. మఱ్ఱియాకులయందుఁగాని, రావియాకులయందుఁగాని, కానుగాకులయందుఁగాని భోజనము చేయఁగూడదు.

శ్లో. ఆపద్యపి న కాంస్యేషు మలాశీ కాంస్యభోజనః,
సౌవర్ణే రాజతే తామ్రే మృణ్మయే త్రపుసీసయోః.

ఆపత్కాలమందైనా ఈసన్న్యాసి కంచు బంగారు వెండి రాగి మృత్తు సత్తు సీసము ఈపాత్రలయందు భోజనము చేయఁగూడదు. చేసెనో మలమును భక్షించినవాఁడగును.

ఈప్రకారమే లోకమును (శిష్యవర్గమును) పరిగ్రహించఁగూడదు.

ఇది మనువుచేఁ జెప్పఁబడినది.

శ్లో. ఏక ఏవ చరేన్నిత్యం సిద్ధ్యర్థమసహాయకః,
సిద్ధిమేకస్య పశ్యన్ హి తజ్జహాతి న హీయతే.

తా. సన్న్యాసి యొంటరిగా నుండి తత్త్వజ్ఞానసిద్ధికొఱకు అసహాయముగా సంచరించవలయును. ఏకాకిగా నుండువానికి జ్ఞానసిద్ధి కలుగుటను చూచి ఇతరసహాయమును విడుచును. ఆప్రకార మితరసంగమును విడిచినందున హాని లేదు.

ఈ విషయము మేధాతిథి యను మహర్షి యును
యున్నారు.

శ్లో. ఆసనం పాత్రలోభశ్చ సంచయశ్శిష్యసంగ్రహః,
దివాస్వాపో వృథాలాపో యతేర్బంధకరాణి షట్.

తా. ఆసనము, పాత్రలోభము, సంచయము, శిష్య
గ్రహము, దివాస్వాపము వృథాలాపము అను నీయా
సన్న్యాసికి బంధకములు.

ఈ చెప్పినయాఱుదోషముల యొక్క స్వభావము ఆ
చేతనే వివరింపఁబడినవి.

శ్లో. ఏకాహాత్పరతో గ్రామే పంచాహాత్పరతః పురే,
వర్షాభ్యోఽన్యత్ర యత్స్థాన మాసనం తత్ప్రకీర్తితం.

తా. గ్రామములో నొకదినముకంటె పట్టణము
నైదుదినములకంటె నధికకాలము నిలవడము వర్షాకా
నాలుగు మాసములలో తప్ప నితరకాలములయం దొక
విశేషకాలము నిలుచుటయును ఆసనమనఁబడును.

శ్లో. ఉక్తాలాబ్వాదిపాత్రాణామేకస్యాపి న సంగ్రహః,
భిక్షోర్భైక్ష్యభుజశ్చాపి పాత్రలోభస్స ఉచ్యతే.

తా. సన్న్యాసి యగువాఁడు భిక్షాన్నమును భుజించ
న్నప్పటికి శాస్త్రమందు విధించిన సొరకాయబుఱ్ఱ మొద
పాత్రలలో నొకదానినైనా గ్రహించక పోవుటపాత్రలోభ
చెప్పఁబడును.

శ్లో. గృహీతస్య తు దండాదే ర్ద్వితీయస్య పరిగ్రహః,
కాలాంతరోపభోగార్థం సంచయః పరికీర్తితః.

తా. దండకాషాయాదులనుపరిగ్రహించి అవి శిథిలమైన తరువాత తిరిగి ధరించుటకు గాను రెండుమూడు దండములను కాషాయములను సంపాదించి పెట్టుకొనుట సంచయ మనఁబడును.

శ్లో. శుశ్రూషాలాభపూజార్థం యశోఽర్థం వా పరిగ్రహః,
శిష్యాణాం న తు కారుణ్యాత్స జ్ఞేయశ్శిష్యసంగ్రహః.

తా. శుశ్రూష, లాభము, పూజ, కీర్తి వీటిని అపేక్షించి శిష్యులను చేర్చుకొనుట శిష్యసంగ్రహ మనఁబడును. కేవల దయచేత శిష్యులను కృతార్థులను చేయవలయు ననెడి యిచ్ఛచేత చేర్చుకొనుట శిష్యసంగ్రహ మని చెప్పఁబడదు.

శ్లో. విద్యా దినం ప్రకాశత్వా దవిద్యా రాత్రి రుచ్యతే,
విద్యాభ్యాసే ప్రమాదో యస్స దివాస్వాప ఉచ్యతే.

తా. బ్రహ్మజ్ఞానము ప్రకాశస్వరూపమైనందున దివా (పగలు) అనిచెప్పఁబడును. అజ్ఞానము అప్రకాశమైనందునరాత్రి యనఁబడును. జ్ఞానమనెడి పగటియందు ప్రమాదముగలిగి యుండుటయె దివాస్వాప మనఁబడును.

శ్లో. ఆధ్యాత్మికీం కథాం ముక్త్వా భైక్ష్యచర్యాం గురుస్తుతిం,
అనుగ్రహాత్పథిప్రశ్నే వృథాలాప స్స ఉచ్యతే.

తా. అధ్యాత్మవిషయమైన కథలను దేహధారణార్థమైనభిక్షాచరణమునందు భిక్షాం దేహి యను శబ్దోచ్చారణమును పరమేశ్వరస్తవమును వీటిని మాత్రము సన్న్యాసి చేయవలయును. వీటికంటె నిరతములైన దారిసమాచారములను అనుగ్రహముచేతనడిగినా, అదివృథాలాప మనిచెప్పఁబడును. శిష్య

వా. ఇంతవరకు యోగియైనపరమహంసకు వైదికలౌకిక వ్యాపారములయందుండు బాధకములను గనుపఱచి వాటిని విడువవలయు నని చెప్పఁబడినది.

అ.-ఇతఁడు సర్వప్రకారములచేత బాధకములైనవాటిని ప్రశ్నోత్తరములచేతఁ జూపించి వాటిని విడువవలయు నని యీ శ్రుతి చెప్పుచున్నది.

శ్రు. ఆబాధకః క ఇతి చేత్, ఆబాధకోఽస్త్యేవ. యస్మాద్భిక్షుర్హిరణ్యం రసేన దృష్టం చేత్స బ్రహ్మహా భవేత్. యస్మాద్భిక్షుర్హిరణ్యం రసేన స్పృష్టం చేత్స పౌల్కసో భవేత్. యస్మాద్భిక్షుర్హిరణ్యం రసేన గ్రాహ్యం చేత్స ఆత్మహా భవేత్. తస్మాద్భిక్షుర్హిరణ్యం రసేన న దృష్టం న స్పృష్టం న గ్రాహ్యం చేతి.

తా. యోగియైన పరమహంససన్యాసికి మిక్కిలి బాధకమైనది యేదిగా నుండు ననఁగా మిక్కిలిబాధకమైనది యొకటి కలదు. అదిసువర్ణము. సువర్ణమును ఆసక్తితో సన్యాసి చూచెనా, బ్రహ్మహత్య కలవాఁడగును, సువర్ణమందుఁడునాసక్తిచేత దానిని సంపాదించుటయందు, రక్షించుటయందు నెప్పటికి ప్రయత్నమును చేయుచు, ఆసంపాదనరక్షాప్రయత్నములయొక్క వ్యర్థత్వశంకను పరిహరించుకొఱకు ప్రపంచమిథ్యాత్వబోధకములైన వేదాంతవాక్యములను దూషించి, ప్రపంచసత్యత్వమును ప్రతిపాదింపుచుండును. అందుచేత శాస్త్రసిద్ధమైన అద్వితీయబ్రహ్మస్వరూపము ఆసన్యాసిచేత నశింపఁజేయఁబడును గనుక నాసన్యాసి బ్రహ్మహత్య చేసినవాఁడనే చెప్పఁదగును.

ఈయర్థ మొకస్మృతిలోఁ జెప్పఁబడియున్నది.

శ్లో. బ్రహ్మ నాస్తీతి యో బ్రూయాత్ ద్వేష్టి బ్రహ్మవిదం చ యః,
అభూతబ్రహ్మవాదీ చ త్రయస్తే బ్రహ్మఘాతుకాః,
బ్రహ్మహా స తు విజ్ఞేయస్సర్వకర్మబహిష్కృతః.

తా. పరబ్రహ్మ లేఁడని యెవఁడు చెప్పునో, బ్రహ్మవేత్తతో నెవఁడు విరోధించునో, బ్రహ్మస్వరూపము శాస్త్రములోఁ జెప్పినప్రకారముగాఁ గాకుండ మరియొకవిధముగా నెవఁడు నిరూపించునో, వీరు ముగ్గురు బ్రహ్మఘాతుకు లని చెప్పఁబడుదురు. ఈబ్రహ్మఘాతుకుఁడు సర్వధర్మములనుండి బహిష్కృతుఁడై యీలోకములో నిందింపఁబడుచు పరలోకమున కయోగ్యుఁడై చెడిపోవును. అభిలాషపూర్వకముగా సువర్ణమును స్పృశించినపక్షమున సన్యాసి పతితుఁడై మ్లేచ్ఛసమానుఁడై పోవును.

ఈయర్థము స్మరింపఁబడుచున్నది.

శ్లో. పతత్యసౌ ధ్రువం భిక్షుర్యస్య భిక్షోర్ద్వయం భవేత్,
ధీపూర్వం రేతఉత్సర్గః ద్రవ్యసంగ్రహ ఏవ చ.

తా. ఏసన్యాసి బుద్ధిపూర్వకముగా రేతస్సును విడుచునో, సువర్ణమును సంగ్రహించునో, ఆసన్యాసి నిశ్చయముగా పతితుఁ డౌను.

ఆసక్తిపూర్వకముగా సువర్ణమును గ్రహింపఁ గూడదు. గ్రహించెనో, అట్లు యీసన్యాసి దేహేంద్రియాదిసాక్షియై యసంగుఁడైన చిదాత్మను చంపినవాఁడగును. ఆత్మయొక్క అసంగత్వమును మఱచి సువర్ణాదిద్రవ్యమును గూర్చి ఆత్మభోక్త యని

యంగీకరించినందున ఆత్మహత్య చేసినవాఁడని చెప్పఁ బడును. ఇట్టి అన్యథాప్రతిపత్తి సర్వపాపస్వరూప మని మహాభారతములో శకుంతలాదుష్యంతసంవాదములోఁ జెప్పఁబడియున్నది.

శ్లో. అన్యథాసంతమాత్మానం యోఽన్యథా ప్రతిపద్యతే,
కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా.

తా. ఒక ప్రకారముగా నున్న యాత్మస్వరూపమును మరియొక ప్రకారముగా నెవ్వఁడు తలఁచునో, అట్టి ఆత్మాపహారము చేసిన చోరుఁడు ఏపాపమును జేయనివాఁడుగా నుండును? అనఁగా సర్వపాపములను జేసినవాఁడే యని యర్థము.

అదిగాక యాత్మహత్య చేసినవానికి సుఖలేశము కూడ లేక నానావిధదుఃఖపూర్ణము లైన లోకములు ప్రాప్యములుగా నుండు నని యొకశ్రుతిచేఁ జెప్పఁబడుచున్నది.

శ్రు అసుర్యా నామ తే లోకా అంధేన తమసా వృతాః,
తాంస్తే ప్రేత్యాభిగచ్ఛంతి యే కేచాత్మహనో జనాః.

తా. ఆత్మ నన్యథాప్రతిపత్తిచే నశింపఁజేసిన పురుషులు గాఢాంధకారముచే నావరింపఁబడిన అసుర్యము లనుపేరుగల పాపలోకములను పొందుదురు. దృష్ట స్పృష్ట గ్రాహ్యాశబ్దములతో క్రమముగా సంబంధించిన చకారత్రయమునకు శ్రుతకథితవ్యవహృతము లర్థము. సువర్ణముయొక్క దర్శన స్పర్శన గ్రహణములు సన్యాసికి ప్రత్యవాయకరము లైనటుల సాభిలాషముగా సువర్ణముయొక్క వృత్తాంతమును వినుటయును దాని

గుణములను కీర్తించుటయును సువర్ణమును క్రయవిక్రయాదుల చేత వ్యవహరించుటయును ప్రత్యవాయకరము లని తాత్పర్యము. సన్యాసికి సువర్ణదర్శనాదులు దోషసంపాదకములు గనుక వాటిని సన్యాసి ప్రయత్నపూర్వకముగా పరిహరించవలయునని సముదాయతాత్పర్యము.

సువర్ణమును త్యజించినందువలన విశేషఫలమును చెప్పుచున్నది.

శ్రు. సర్వే కామా మనోగతా వ్యాపత్తంతే; దుఃఖేనోద్విగ్నస్సుఖే నిస్పృహస్త్యాగే రాగే సర్వత్ర శుభాశుభయోః సుఖస్నేహో న ద్వేష్టి న శోచతేచ సర్వేషామింద్రియాణాం గతిరుపరమతే య ఆత్మన్యేవావస్థీయతే.

తా. పుత్రభార్యాగృహక్షేత్రాదికామము లన్నియు సువర్ణమూలములు గనుక సువర్ణమును పరిత్యజించఁగా మనోగతములైనయీకామము లన్నియు పరిత్యజింపఁబడును. కామములనుపరిత్యజింపఁగా కామముచేతప్రాప్తించుసుఖమునందభిలాషయును దుఃఖమునందుద్వేగమును గలుగ నేరదు. సుఖదుఃఖములయందభిలాషోద్వేగములు సంభవింప నేర వనునర్థము స్థితప్రజ్ఞలక్షణమును చెప్పునప్పుడు విస్తారముగా నుపపాదించి యున్నారము. ఐహికసుఖదుఃఖములను విడువఁగా నాముష్మికసుఖమునందు రాగమును విడువఁబడును. ఐహికసుఖాభిలాష గలపురుషుఁడే యాముష్మికసుఖమును కోరుచుం

ఈశ్లోకతాత్పర్యము ముందే వ్రాయఁబడియున్నది.

శ్లో. జీవన్ముక్తిప్రకాశేన తమోహార్దం నివారయన్,
దేయాత్పుమర్థమఖిలం సద్గురుశ్శ్రీజనార్దనః.

ఇది శ్రీ జీవన్ముక్తిప్రకాశికయందు విద్వత్సన్న్యాస
నిరూపణ మను పంచమప్రకరణము,

శ్రీ జీవన్ముక్తిప్రకాశిక సమాప్తము.



చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
శ్రీ రామా ప్రెస్సున ముద్రితము.—1926.

| | | | |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| గరుడపురాణము, సవ్యాఖ్యానాంధ్ర తాత్పర్యసహితము | ... | 1 | 8 |
| భర్తృహరి, సవ్యాఖ్యానాంధ్ర పద్యటీకాతాత్పర్యసహితము | | 2 | 12 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము | ... | 2 | 0 |
| నైష్కర్మ్యసిద్ధి, సాంధ్ర టీకాతాత్పర్యము | ... | 3 | 8 |
| అపరోక్షానుభూతి, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 0 | 4 |
| అద్వైతపంచరత్నము ,, | ... | 0 | 2 |
| అద్వైతోపదేశపంచరత్నములు (సాధనపంచకము) | ... | 0 | 2 |
| అద్వైతసంగ్రహము, తెనుఁగువచనము | ... | 0 | 2 |
| ఆత్మబోధము, సటీక | ... | 0 | 4 |
| ఆత్మపూజ, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 1 |
| ఆత్మవిద్యావిలాసము ,, | ... | 0 | 6 |
| ఆత్మానాత్మవివేకము ,, | ... | 0 | 4 |
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు | ... | 0 | 12 |
| ఋభుగీతా ,, | ... | 0 | 8 |
| పంచదశప్రకరణము, సవ్యాఖ్యానము | ... | 1 | 4 |
| ,, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 5 | 0 |
| పంచీకరణము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| డిటో తెనుఁగువచనము | ... | 0 | 2 |
| రామగీతా, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| వివేకచూడామణి, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |
| బ్రహ్మసూత్రములు, మూలము, చిన్నసైజు | ... | 0 | 3 |
| బ్రహ్మసూత్రములు, తెనుగువచనము, శ్రీశంకరాచార్యుల వారిభాష్యము అందరికిని తెలియుట దుర్లభమనితలచి చక్కనిశైలిలో అనేకవృత్తులననుసరించి తెనుఁగువ్యాఖ్యానమును ప్రకటించినారము, 2 సంపుటములు | ... | 12 | 0 |

| | | ప్రతి 1-కి రూపా. | అ |
|---|---|---|---|
| వ్యవహారపంచకము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | [illegible] |
| వేదాంతస్తోత్రపంచకము, శ్రీశంకరాచార్యకృతము, ఆంధ్ర తాత్పర్య సహితము:—ఇందు ఏకశ్లోకి, యతిపంచకము, మనీషాపంచకము, ప్రాతస్స్మరణము మొదలైనవి గలవు | ... | 0 | [illegible] |
| ఋతుసంహారము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 0 | [illegible] |
| కాదంబరి, క్రొత్తకూర్పు | ... | 1 | [illegible] |
| కుమారసంభవము, సవ్యాఖ్యానము, మేలుప్రతి | ... | 0 | 1[illegible] |
| డిటో సంస్కృతాంధ్ర టీకాతాత్పర్యసహితము | ... | 1 | [illegible] |
| కవిరాక్షసీయము, ద్వ్యర్థి కావ్యము, సంస్కృతాంధ్ర టీకాతాత్పర్యసహితము | ... | 0 | 12 |
| గీతాగోవిందము, (అష్టపది) ఆంధ్రటీకాతాత్పర్య వివరణసహితము | ... | 1 | 4 |
| దశకుమారచరిత్రము, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| నైషధము, సవ్యాఖ్యానము, 6 సర్గలు | ... | 1 | 0 |
| నీతిశాస్త్రము, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 0 | 3 |
| పుష్పబాణవిలాసము, సంస్కృతాంధ్రవ్యాఖ్యానసహితము | ... | 0 | 4 |
| పంచబాణవిజయము, చక్కనికూర్పు | ... | 0 | 4 |
| సంస్కృత (నాగరిలిపి) బాలశిక్ష | ... | 0 | 3 |
| బిల్హణచరిత్ర, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| భాషామంజరి, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| వసంతతిలక భాణము, చక్కనికూర్పు | ... | 0 | 4 |
| విక్రమార్కచరిత్ర, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 1 | 0 |
| శాకుంతలనాటకము, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు | ... | 1 | 8 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.